# ఇందలి పాత్రలు.



| రాజపుత్రులు. | మహమ్మదీయులు. |
| --- | --- |
| పృథ్వీసింహుఁడు | మానసింగు |
| ధర్మసింగు | తోడర్ మల్లు |
| రామభట్టు | అబ్దుల్ ఫజల్ |
| భరద్వాజుఁడు | అక్బరు |
| ఠాకూరుసింగు | లోడీఖాన్ |
| వీరాసింగు | మొహిద్దీన్ ఖాన్ |
| గోపాలసింగు | మహమ్మదు హుస్సేన్ ఖాన్ |
| నారాయణపండితుఁడు | దావూద్ ఖాన్ |
| గోరాసింగు | రాయబారులు |
| జయమల్లు | సేవకులు |
| సాలుంబ్రా | సైనికులు |

## స్త్రీలు.

మీరాబాయి. రాణాబాయి. కర్ణావతీదేవి.



సరస్వతీ గ్రంథమాల. 38 వ పుష్పము.

సంపాదకుఁడు:
కె. యస్. యన్. మూర్తి,
కాకరపర్రు.

అధ్యక్షులు:
జవ్వాది లక్ష్మయ్యగారు,
పెనుగొండ.

# చిత్రోడుపతనము.

(సమవాకారము.)

కర్త:
కోటమర్తి చినరఘుపతి,
కాకినాడ.



కాకినాడ:
శ్రీపతిముద్రాలయమందు
ముద్రితము.
1935.

 [వెల రు. 0-12-0.

# ఉపోద్ఘాతము.

సుప్రసిద్ధకవులై ప్రతాపసింహ, సుయోధనవిజయము, సరళాదేవి మొదలగు నాటకముల రచించిన శ్రీయుత కోటమర్తి చినరఘుపతిరావుగారు మా సరస్వతీ గ్రంథమాల పక్షమున వారి వీరరసప్రధానమైన "చిత్తోడుపతనము" అను సమవాకారమును ప్రకటించుకొననిచ్చినందులకు వారి కెంతయు కృతజ్ఞులము. దేశీయభావములతో నలరారుచున్న యీనాటకము చదువుటకును, ప్రదర్శించుటకును గూడ ననుకూలముగ నుండుటచే మాగ్రంథమాలలో నిది 38 వ పుష్పముగ నలరారుచున్నది. విద్యాభిమానులగువా రీగ్రంథమును జదివి మాకుం దగిన ప్రోత్సాహ మొసంగఁగలందులకుఁ ప్రార్థన.

ఇట్లు,

కాకరపర్తి సత్యనారాయణమూర్తి.

# శాశ్వత మహారాజ పోషకులు.

1 మహారాజశ్రీ శ్రీరాజా విజయ అప్పారావుసవాయి, అశ్వారావు జమీందారు, ప. బాదుషాహి మనసబుదారుసర్కారు; ముస్తఫాన్నగరు సంస్థాన్ పాలవంచ శ్రీభద్రాచలం అండ్ నిడదవోలు దొరవారు, అశ్వారావుపేట.

2 ,, చుండూరి నారాయణరావుగారు, బ్యాంకర్సు, పాలకొల్లు.

# మహారాజ పోషకులు.

3 శ్రీ శ్రీ శ్రీ సురభి వెంకటరత్నమాంబ నిజాం, నవాబ్‌వంతు బహద్దరు మహారాణీవారు; జటప్రోలు సంస్థానం, కొల్లాపురం.

4 ,, రాజా వెంకటాద్రిఅప్పారావు బహద్దరు జమీందారువారు, ప్రయ్యూరుల యెస్టేటు, నూజివీడు.

5 ,, సత్తి వెంకయ్యగారి కుమాళ్లు కామిరెడ్డిగారు, మార్టేరు.

6 ,, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు, ఆంధ్రపత్రికాసంపాదకులు, మదరాసు.

7 ,, కర్రి చినవెంకటరెడ్డిగారు, జనరల్ మర్చెంటు, రంగూన్.

8 ,, జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్., రిటైర్డు డిప్యూటీ కలెక్టరు, ముక్తేశ్వరము.

9 ,, శ్రీరాజా మాగల్ల వెంకటచలంపంతులు కుమారుజమీందారువారు, కసింకోట వగైరా ఎస్టేటు, కసింకోట.

10 ,, జవ్వాది లక్ష్మయ్యగారు-ప్రెసిడెంటు యూనియన్ బోర్డు-డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, పెనుగొండ.

# రాజపోషకులు.



1 శ్రీ శ్రీ శ్రీ వీర వెంకట సత్యనారాయణస్వామివారు, ధర్మకర్త. శ్రీరాజా యి వి. ఆర్. యస్. ప్రకాశరాయబహదురు జమీందారువారు, ఉండూరు, అన్నవరం.

2 ,, జంపన సుబ్బరాజుగారు, ప్రొప్రైటరు, చినయంద్రకోలను, ఖండవిల్లి.

3 ,, శ్రీరాజా చింతలపాటి సూర్యనారాయణరాజుగారు, ఏటికొప్పాక.

4 ,, పెనుమెత్స సీతారామరాజుగారు, ల్యాండులార్డు, అజ్జరం.

5 ,, ముత్తా సర్వారాయుడుగారు, బ్యాంకరు, కాకినాడ.

6 ,, భారతం సూర్యనారాయణగారు, ఎల్. ఎమ్. పి. ఖండవిల్లి.

7 ,, ఆణివిళ్ల చినవెంకటశాస్త్రిగారు, ల్యాండులార్డు, కాకరపర్రు.

8 ,, ద్వారంపూడి బసివిరెడ్డిగారు, మాష్టరు.

9 ,, మొసలికంటి రామారావుగారు, ల్యాండులార్డు, కాకినాడ.

10 , తణుకు భాస్కరరావుగారు, యల్. యమ్. యస్. నేత్రశస్త్రవైద్యులు, ఐ. స్పెషలిష్టు, తణుకు.

11 ,, ఆణివిళ్ల వెంకటశాస్త్రిగారు, కాకరపర్రు.

12 ,, నూలి నమశ్శివాయిగారు. రైసుమర్చెంటు Dealers in Burma Shell Products. నర్సాపురం.

# పోషకులు.

1 శ్రీ శ్రీ శ్రీ గావుసా హేబు గుత్తా వెంకయ్యచౌదరిగారు, ఏలూరు.
2 ,, మల్లిడి సత్యనారాయణ రెడ్డిగారు, రంగూన్.
3 ,, సి. సన్యాసిరాజుగారు, డాక్టరు, సామర్లకోట.
4 ,, లంక రామారావుగారు, యం. బి. (హోమియో) కాకినాడ.
5 ,, కళా వెంకట్రావుగారు, అమలాపురం.
6 ,, శ్రీరాజా సాగి సూర్యనారాయణరాజుగారు, తంగేడు.
7 ,, నడింపల్లి సుబ్బరాజుగారు, కోడూరుపాడు.
8 ,, వైద్యరాజ, ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు, ప్రొప్రైటర్, వెంకటేశ్వర ఆయుర్వేదనిలయం, చింతలూరు.
9 ,, యెల్లేపెద్ది వెంకటకృష్ణారావుగారు, ఎం. ఏ. గొంటువానిపాలెం.
10 ,, వక్కలంక నరసింహం పంతులుగారు, రిటైర్డు రివెన్యూ ఆఫీసరు, కొవ్వూరు.

# సహాయులు.

1 శ్రీ శ్రీ శ్రీ మోతే కృష్ణారావుగారు, జమీందారు, ఏలూరు.
2 ,, కొండూరి నారాయణరావుగారు, మర్చెంటు, ఏలూరు.
3 ,, పైడా శ్రీరామకృష్ణయ్యగారు, జమీందారు, కాకినాడ.
4 ,, పోలవరపు రామచంద్రరావుగారు, ఇరిగేషన్ గుమాస్తా, ఏలూరు.
5 ,, బసవ సూరన్నగారు, తాడేపల్లిగూడెం.
6 ,, కాసాని అప్పారావుగారు, నిడదవోలు.
7 ,, తాడంకి సంజీవరావుగారు, జనరల్ మర్చెంటు, బెజవాడ.

8 శ్రీ శ్రీ శ్రీ కొల్లూరు మహాదేవుడుగారు, కరణం, కొక్కిరపల్లి.

9 ,, గొంది కేశవులుగారు, ల్యాండులార్డు, కొవ్వలి.

10 ,, ముముషట్ల వీరన్న గారు, క్లార్కు, పి. డబ్లియు, డి.
సెట్టిపేట.

11 ,, శిష్టా వెంకటసుబ్బయ్యగారు, నర్సాపురం.

12 ,, అప్పన లక్ష్మీపతి గారు, యిుంజివరపుకోట్టా.

13 ,, రాజ పేయయాజుల రామసుబ్బారాయుడు గారు,
కొల్లాపురం.

14 ,, సూరిసెట్టి స్వామినాయుడు గారు డిస్ట్రిక్టుబోర్డు మెంబరు,
మగటపల్లి.

15 ,, సత్తి రామన్న గారు, సవరప్పాలెం.

16 ,, తణుకు వెంకటాద్రియుడు గారు, ప్రొప్రైటరు, S. S. I.
Textile Colour works. గొల్లపాలెం.

17 ,, భూపతిరాజు సూర్యనారాయణరాజు గారు, ఖండవిల్లి.

18 , యం జె. వెంకటాద్రయ్యగారు, పోలీసు ఇన్స్పెక్టరు,
సత్రెంపల్లి.

19 ,, నిమిషకవి భవానిశంకరరావు గారు, యాక్సైజ్ సబ్ ఇనస్పె
క్టర్, నిడదవోలు.

20 ,, మామిడి సూరన్నగారు, ఇనుపపెట్టెలు వర్తకులు,
ధవిళేశ్వరం.

21 ,, యం. రామకృష్ణయ్యగారు, డాక్టర్, నిడదవోలు.

22 ,, ఝట్టా శ్రీరంగనాయకులుగారు, పోలీసు సబ్ఇనస్పెక్టరు,
ఏలూరు.

23 ,, దమ్మలపాటి వెంకటాద్రివుగారు, ల్యాండులార్డు,
బాదంపూడి.

24 శ్రీ శ్రీ శ్రీ తుమ్మలపల్లి వీరభద్రరావుగారు, ప్రొప్రైటరు రైసుమిల్లు, పిప్పర.

25 ,, టి. జీ. బంగారుస్వామి సెట్టిగారు, రాజమండ్రి.

26 ,, పోడూరి కనకరాజుగారు, ఇంపీరియల్, కెమికల్, ఇండస్ట్రీసు-ట్రావెలరు, నిడదవోలు.

27 ,, భారతం నరసింహంగారు డాక్టర్, రాజోలు.

28 ,, పరిమి సుబ్బారావుగారు ల్యాండులార్డు, తణుకు.

29 ,, డాక్టర్. టి. కే. వరదాచార్యులుగారు. ఫిజిషియన్ & సర్జన్-స్పెషలిష్టు, (ఆస్త్మ & లెప్రసీ) ఏలూరు.

30 ,, తల్లాప్రగడ భాస్కరరావుగారు, ల్యాండులార్డు, కోనాల.

31 ,, కాకరాల వెంకటరమణయ్యగారు, ప్రొప్రైటరు, శ్రీవెంకటరమణ ఆయుర్వేద నిలయము, సామర్లకోట.

32 ,, దూర్వాసుల సూర్యనారాయణగారు, ఇన్స్పెక్టర్, స్టార్ ఆఫ్ ఇండియా, రాజమండ్రి.

33 ,, రేబాల పట్టాభిరామరెడ్డి జమీందారువారు. నెల్లూరు.

34 ,, యం. దశరథరామరెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాలెం.

35 ,, బెజవాడ వెంకటకృష్ణారెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాలెం.

36 ,, శ్రీ పెండ్యాల శ్రీరామచంద్ర వెంకటకృష్ణరంగారావు జమీందారువారు, కొండగూడెం ఎస్టేటు, నొమ్మెరు.

37 ,, కొత్త వెంకటేశ్వర్లుగారు, కమీషన్ వ్యాపారము, నిడదవోలు.

38 ,, కందుకూరి సుబ్బారావుగారు, నిడదవోలు.

---

39. శ్రీ శ్రీ శ్రీ మల్లంపల్లి వీరయ్యగారి కుమార్లు సుబ్బారావుగారు, ల్యాండులార్డు, కొత్తపల్లి, అగ్రహారం.

40. ,, సామంతుల వెంకన్ననాయుడుగారు, పోలీసు సబ్-యిన్‌స్పెక్టరు, ఏలూరు.

41. ,, రంకిరెడ్డి సత్యనారాయణమూర్తిగారు, ల్యాండులార్డు, వేమగిరి.

42. ,, డాక్టరు వారణాసి రమణారావుగారు, రిజస్టర్డు మెడికల్ ప్రాక్టీషనరు, నిడదవోలు.

43. ,, కామవరపు వెంకటాద్రివుగారు, రాజమండ్రి.

44. ,, పెనుమత్స రంగరాజుగారు, ల్యాండులార్డు, మొగలితుర్రు

45. ,, కే. బాబూరావుగారు, Excise Sub-Inspector, తెక్కలికోట.

---

*

# సరస్వతీ గ్రంథమాల,



కాకరపఱ్ఱు, తణుకుతాలూకా, (పశ్చిమ గోదావరిజిల్లా.)

స్థాపితము 1923.

ఈ గ్రంథమాలయందు 3 మాసముల కొక గ్రంథము చొప్పున రసవంతమగు చరిత్రాత్మక, అపరాధ రహస్యపరిశోధక నవలలు, నాటకములు ప్రచురింపఁబడుచుండును. భాషాభిమానులందరును రాజపోషకులుగను, చందాదారులుగను ప్రవేశింపఁ బ్రార్థితులు.

సంవత్సరమునకు చందా రు. 1-8-0 లు.

ప్రవేశరుసుము రు. 0-8-0 లు.

| | | | |
|---|---|---|---|
| ♦ | 1 | కనకాంగి | 0— 8—0 |
| † | 2 | మదనసుందరీ పరిణయము | 0—12—0 |
| ♦ † | 3 | షీప్సానారాయణరావు | |
| ♦ | 4 | సరోజభాస్కరము | 0—12—0 |
| † | 5 | కీచకవధ | |
| | 6 | ప్రహ్లాద | 1— 0—0 |
| ♦ | 7 | ఆనందమయి I | 1— 8—0 |
| ♦ | 8 | ,, II | |
| ♦ | 9 | విజయశ్యామ్ | 0—12—0 |
| | 10 | ప్రేమమహిమ I | 1— 0—0 |
| ♦ | 11 | ,, II | |
| | 12 | బిలమందిరము | 0—12—0 |

| | | | | |
|---|---|---|---|---|
| ♦ | 13 | మహారాష్ట్ర జీవప్రభాతము | I | 1—8—0 |
| ♦ | 14 | ,, | II | |
| | 15 | దుర్గావతి | | 0—12—0 |
| | 16 | హత్యానిరూపణము | | 0—12—0 |
| ♦ | 17 | కథావళి | | 0—12—0 |
| ♦ | 18 | నీరజ | | 0—12—0 |
| ♦ | 19 | కష్టసుఖములు | I | 1—8—0 |
| ♦ | 20 | ,, | II | |
| | 21 | నీలిపూలు | | 0—12—0 |
| | 22 | పతితనళిని | I | 1—8—0 |
| | 23 | ,, | II | |
| | 24 | అకాలీల సత్యాగ్రహము. | | 0—12—0 |
| ♦ | 25 | ప్రేమచందు కథలు | | 0—12—0 |
| ♦ | 26 | గృహవిచ్ఛిత్తి | I | 1—0—0 |
| ♦ | 27 | ,, | II | |
| | 28 | పిచ్చిపిల్ల | | 0—12—0 |
| ♦ | 29 | నీతి ముక్తావళి | | 0—2—0 |
| | 30 | జీవనసంధ్య | | 0—12—0 |
| | 31 | కలము | | 0—2—0 |
| | 32 | నా ఎలెక్షను అనుభవము | | 0—12—0 |
| | 33 | రాజ్యపాలనాశాస్త్రము | | 0—12—0 |
| | 34 | మరణభ్రమ | | 0—12—0 |
| | 35 | చిత్తోడుపతనము | | 0—12—0 |

♦ Approved † Out of stock

అవిఘ్నమస్తు.

# చిత్తోడుపతనము.

## ప్రథమాంకము.

### ౧వ రంగము.

ప్రవేశము:—ఒకకోటలో వివాహమంటపము.

[ప్రవేశము:—ధర్మసింగు, రామభట్టు, భరద్వాజుడు, తాహూసుసింగు నొకప్రక్కను; వీరాసింగు, నారాయణ పండితుడు, గోపాలసింగు వేఱొకప్రక్కను, కొందఱు పౌరులు, బ్రాహ్మణులు మూడవ ప్రక్కను కూర్చుండఁగా వివాహవేదికపై పుట్టూసింగు కూర్చొని యుండును. బ్రాహ్మణులు మంత్రముల చదువుచుందురు. తెరలో వాద్యధ్వనులు- కొందఱు చందనతాంబూలాదులు సదస్యుల కొసఁగుచుందురు. కొందఱు పన్నీరు చిలకరించుచుందురు. బ్రాహ్మణులుచ్ఛస్వరములతో పనస చదువుచుండఁగా తెర యెత్తఁబడును.]

రామ—(కొంతసేపు మంత్రములు చదివి పిదప మాంగళ్యసూత్రము దెచ్చి) బాబాజీ! నీ వీమంగళసూత్రమును రాణాబాయికిఁ గట్టునట్లు చేయుము.

పుట్టా—(లేచి యొక దాసి కామాంగళసూత్ర మిచ్చును. దాసి లోని కేగును.)

రామ—(తెరలోనికిఁ జూచి) మాంగళసూత్రధారణ మైనదా?

[తెరలో] ఆఁ! అయినది.

రామ—బాబాజీ! నీవు లేచి మీమామగారికిని, పినతండ్రి గారికిని, సభ్యులకును నమస్కరింపుము.

పుట్టా—మామగారూ! నమస్కారము. (నమస్కరించును.)

వీరా—దీర్ఘాయుష్మాన్భవ! (దగ్గఱకుఁ దీసికొని)

ఘనమగు ప్రేమవార్ధిని సుఖంబుగఁ దేలఁగఁ జేయునో రణం
బున నసిధార శాత్రవ సకేసమూహము జింపి జయింపఁ జేయునో
మనముల రారఁ జేయుమభిమానసుతోఁ బదునాల్గువత్సరాల్
జనిచితి నీకు నిచ్చితిని శ విశ్రుత రూప సమన్వితన్ సుతన్.

[ప్రవేశము:—సేవకుఁడు.]

సేవ—పుట్టాజీసర్కార్! ఏలినవారి దర్శనార్థమై యొక రౌతు రోఁజుకొనుచు వచ్చి తలవాకిట వేచియున్నాఁడు. ముదలయేని లోనికిఁ గొనితెచ్చెద.

పుట్టా—(సాలోచనముగా) రౌతా? రోఁజుకొనుచు వచ్చెనా? సత్వరముగఁ బ్రవేశపెట్టుము.

సేవ—దేవరయాజ్ఞ. (నమస్కరించి వెడలి తిరిగి రౌతుతోఁ బ్రవేశించును.)

రౌతు—(వంగి నమస్కరించి) ఫుట్టాజీసర్కార్ ! చిత్తూరు సంస్థానామాత్యులైన నాగేశ్వరపండితులు యీజాబును దమకందజేసి ప్రత్యుత్తర మందఁ జేయవలసిన దని యాజ్ఞాపించి పంపించిరి. (జాబు నొసంగును.)

ఫుట్టా—భరద్వాజామాత్యా ! ఈలేఖం జదువుఁడు.

భర—(లేఖం గొని యిట్లు చదువును.)

ఖేల్నా సంస్థానాధీశ్వరులై చాందావం
శోద్ధారకులైన శ్రీ ఫుట్టాజీ సర్కారు
వారి దివ్య సమ్ముఖమునకు—

సేవకుఁడు చిత్తూరు సంస్థానామాత్యుఁడైన నాగేశ్వర శర్మ వ్రాసికొనిన విజ్ఞాపనము.

ఉభయకుశలోపరి:—

చిత్తూరు రాణావారు స్వయముగ వ్రాయవలసిన యీ జాబును తమకు నేను వ్రాయవలసివచ్చినందులకు మన్నింపఁ బ్రార్థితులు.

పవిత్రవంతమైన భారతదేశమున హిందువుల పరిపాలనము నాశనముచేయవలె ననుతలంపు మనశత్రువులకు గాటముగ నలముకొనియున్నది. ఈరాజపుత్రస్థానాంతర్గతహిందూ సంస్థానములలోఁ జిత్తూరు- ఉత్తమక్షత్రియవీరుల జన్మస్థానమై, శ్రీనివాసమై, సర్వకళాశాలమై యలరారుచుండుటచే మొగలాయీప్రభువు లీసంస్థానమును గోటను నిర్మూలనము సేయఁ

కృతనిశ్చయులై యిదివఱలో రెండుసారులు చిత్తూరును ముట్టడించిరి. అప్పుడు వారు తగినఫలితమును బొందియుండియుందిరి. మూఁడవసారి కొంతసైన్యమును సమకూర్చుకొని సముత్సాహముతో స్వయముగ నక్బరుచక్రవర్తిని దీసికొని వచ్చుచున్నారు. వచ్చుచున్నారన నేల? శాత్రవశిబిరము లనతిదూరములోనే కాన్పించుచున్నవి. చిత్తూరుసంస్థానమున నొక్కప్రాణి జీవించియున్నను గోట శత్రువులకుఁ జిక్కనేరదని గుర్తింపనేరక మహారాణావారీసారి యపజయము తప్పక సంభవించు నని భయమంది సంస్థానమును విడిచి పలాయితులైరి. అందుచేఁ జిత్తూరురాజ్యలక్ష్మి నేఁటి కనాథయై యున్నది. ఈ సంస్థాన సంరక్షణార్థమై బ్రదికియున్నపౌరులను యుద్ధభూమిలో నడిపింపఁగల నాయకుఁడు లేకపోయె. దేశదాస్యవిమోచనదీక్షాపట్టిష్ఠులైన యీమేవారుదేశీయులు నిస్సహాయులై యేమిచేయుటకును దోఁపక యాందోళనముపా లగుచున్నారు. తమకుఁ దమ కీదురవస్థను గూర్చి తెలుపవలసిన దని నన్నుఁ గోరిరి.

తమరు ప్రజాభిప్రాయమును బాలించు ప్రభువు లని యీకమ్మ వ్రాసికొంటిమి. మమ్ము పాలనో నీటనో ముంచు భారము మీచేతిలో నున్న దని—

విన్నవించుకొను తమసేవకుఁడు,

నాగేశ్వర శర్మ,

అమాత్యుఁడు.

చిత్తూర్,
భాద్రపద బ 3 బుధవారము. }

పుట్టా—నే ననుకొనినట్లే యుద్ధము సంప్రాప్తమైనది. మన కిపుడు కర్తవ్య మేమి? పితాజీ!

ధర్మా—చిత్తూరుమహారాణావారే పలాయితులైన చిన్న సంస్థానాధిపతుల మైన మనము మొగలాయీచక్రవర్తి నెదిర్చి జయము గాంచుట దుర్ఘట మేమో!

పుట్టా—భరద్వాజామాత్యా! మీయభిప్రాయ మేమి?

భర—రాజపుత్రస్థానమందలి వివిధసంస్థానాధిపతు లందఱు సాహాయ్యముఁ జేసిన మీరు యుద్ధసన్నద్ధులు కావచ్చును.

పుట్టా—భరద్వాజా! పితాజీమాటలను గొంచెము త్రిప్పి చెప్పితివి. కాని సారాంశ మంతయు నొక్కటియే. రామభట్టోజీగురువు లేమియాన తిచ్చెదరో!

రామ—బాబాజీ! చిత్తూరుమహారాణావారు స్వయముగ రణరంగమున నిలిచి యుద్ధము చేయుచున్నప్పుడు మనము కొంచెము సైన్యము సాహాయ్యార్థము పంపిన బాగుగనుండియుండును. కాని రాణావారు పలాయితులగుటచేఁ దత్సంస్థానసన్నిహితజ్ఞాతులపై వైరిసమూహముల నిర్వీర్యముగాఁ జేయవలసిన భార మున్నమాట సత్యము. కాని ప్రత్యేకించి మీ రొక్కరను శత్రువుల నెదుర్కొనుట వీరోచితకార్యమైనను విజయసంపాదనకార్యము కాఁజాలదేమో యని శంకించుచున్నాను.

పుట్టా—మా పితాజీ చెప్పిన వాక్యమునే రామభట్టోజీ పదివా
క్యములలోఁ జెప్పినారు. మామగారూ! ఈ సమయ
ములో మిమ్ములఁ బ్రశ్నింపరాదు గాని క్షమింపుఁడు.
చిత్తూరసంరక్షణము విషయములో మీ యభిప్రాయ
మేమి?

వీరా—పుట్టాసింహా! ప్రశ్నింపరా దనుటకుఁ గారణము నాకు
ద్యోతకము కాలేదు. కళ్యాణము పూర్తిగాకుండఁ
గయ్యమునకుఁ బాపు మామ యుండఁ డని తలంచి
నీ వట్లంటివా? కాని నీవు నన్నట్టివానిఁగాఁ బరిగ
ణింపకుము. నాకు దేశస్వాతంత్ర్యమే పరమావధి.
భారతీయుల బానిసలగాఁ జేయు పరరాజుల ఖండించు
టయే మదాశయము. అతివలతో నంతఃపురముల హంస
తూలికాడోలికలలో నానంద మొందుటకంటె దేశభక్తి
పరాయణులైన భారతీయసోదరులతోఁ బలుబాధల
నైనఁ బొందుచు సామ్రాజ్యైశ్వర్యముల ననుభవించు
పరచక్రవర్తితోఁ బోరుటయే మదభీష్టము. అట్టియెడ
నాయభిప్రాయముల నీ వర్థింప నేల?

పుట్టా—మీయట్టి వీరాగ్రేసరులైన చక్రవర్తులయండ నుండఁ
దలఁచియే మేమిటు వచ్చినారము. మీయట్టివారి
స్నేహము మాకు సంప్రాప్తించుటచే మేము నిక్కముగ
గర్వపడవలసినదే. కాని, మీ సమక్షముననే మా పితా

జేయు, నమాత్యులును, గురువులును గొంత ప్రసంగించి
యున్నారు కదా! మీయభిప్రాయమును గూడఁ దదను
గుణముగా నుండునో భిన్నముగా నుండునో యెఱుఁగఁ
గోరి ప్రశ్నించితిని.

వీరా — పుట్టాసింహా! నా యభిప్రాయములు, నా యాశయ
ములు వేఱని చెప్పియున్నాను గదా! నే నేవిధము
నను నీవిషయములో మీవారితో నేకీభవింపఁజాలను.

ధర్మా — కళ్యాణమైనఁ బూర్తిగాకుండఁ గయ్యమునకుఁ బాపు
ట యనుచిత మని మే మంటుంటిమి. కాని మేము
దేశసేవాభిలాషులము గాక కాదు. బావగారూ! స్వదే
శసంరక్షణముకంటెఁ జిత్తూరుసంరక్షణమే ముఖ్య
మని మీయభిప్రాయమా!

వీరా — ఎందుచేతఁ గాదు! — నేను చిత్తూరుసంస్థానసామంతరా
జును గాకపోవుటచే చిత్తూరున జరుగఁబోవు యుద్ధముం
గూర్చి భిన్నాభిప్రాయముతో నుండెద ననుకొంటిరా?
అట్లు తలంపకుడు రాజపుత్రసంస్థానాధిపతు లంద ఱేకీ
భావము గలిగి యుండ లేదని విచారించుచున్న నేనే,
వేవారు దేశముపై దాడి రాఁగా సహించెదనా? అందు
విశేషించి మే మెన్నఁ డీపుట్టాసింహుని మాయింటి
యల్లునిగాఁ జేయఁ దలఁచుకొంటిమో ఆనాఁడే మే
మెల్లర మీ పుట్టాతోఁ గలిసి చిత్తూరుస్వాతంత్ర్యమునకై

పోరవలయు నని నిశ్చితాభిప్రాయుల మైతిమి. మామాట యెట్లున్నను, మీ రైనఁ జిత్తూరును సంరక్షించుటయే కర్తవ్యము. చిత్తూరుకోట శాత్రవదుర్భేద్యమైన పర్వతాగ్ర మగుటచే మన మచ్చట నిలిచియే శత్రువుల భంజించుట రాజనీతి.

భర—అయినఁ బుట్టాజీని చిత్తూరు పంపవలసిన దనియే మీ యభిప్రాయము? కళ్యాణమైనఁ బూర్తి కాలేదే!

వీరా—దేశకళ్యాణకార్య మొనరించి పిదప నిజకళ్యాణకార్యముఁ బూర్తి గావించుకొన వచ్చును. ఇంతలో వచ్చిన తొందర యేమి?

రామ—కాంతావలోకనకార్యమైనఁ గాకుండఁ గయ్యమునకుఁ బంపెదరా?

వీరా—ఏమిది? నాకుమాత్రము పుత్త్రికాప్రేమ లేదనుకొనుచున్నారా? కళ్యాణమైనంతమాత్రమునఁ గాళ్లకు సంకెలలఁ దగిల్చి, యింటఁ గూర్చుండఁ బెట్టెద మనుకొంటిరా? అట్లు తలంపకుఁడు. ఏనాఁడు పరరాజు లార్యావర్తమున నడుగుపెట్టిరో, ఏనాఁడు శాత్రవపతులు రాజపుత్త్రస్థానమునంకఁ దమదృష్టులు కేంద్రీకరింపఁజేసిరో, ఏనాఁడు రిపుభర్తలు చిత్తూరుసంస్థానవినాశనముఁ గోరిరో-ఆనాఁడే క్షత్రియయోధులు చిత్తూరుసంస్థానప్రజలు, తత్సంస్థాన సన్నిహితజ్ఞాతులు, తత్సంస్థానసామంతప

తులు "భరతమాతకు జయ్" అని శంఖధ్వానములఁ జేయుచు, విజయలక్ష్మినో, వీరస్వర్గమునో, చూఱఁగొనవలసిన సమయము వచ్చినదని తలంపవలెను. పరరాజు లెన్నపై ఖడ్గపాణులై కూర్చున్నప్పుడు—శత్రువాహినీపతులు చిచ్చువెట్ట నలాతహస్తులై యేతెంచినప్పుడు—అన్యభూనేతలు దండధరులై దేశములు కొల్లగొట్టఁగొనవచ్చినప్పుడు—దేహ, కుల, దేశాభిమానముల విసర్జించి పిఱికివానివలె, సాటివారలలో నగుబాట్లగునట్లుగ బ్రదికిన ప్రయోజన మేమి? జీవించిన నాల్గుదినములు బంధువులు సంతోషించునట్లు—సాటివారలు మెచ్చునట్లు—శత్రువులు తల్లడిల్లునట్లు బ్రదికినదే బ్రదుకు. పుట్టాసింగ్! నిజదేశసంరక్షణార్థము ప్రాణములు పణముగఁ బెట్టి జయాపజయంబుల పరకుగొనక శాత్రవులఁ జీల్చిచెండాడువాఁడే నిజమైన దేశాభిమాని.

పుట్టా—మామగారూ! మీ యమూల్యోపదేశమును వరశుల్కముగా గ్రహించుచుంటిని. వీరపురుషోచితకార్యమును విశదీకరించి యిట్టి సంధిగ్ధావస్థలో నాకుఁ దగిన ప్రోత్సాహ మిచ్చినందులకు మీకుఁ గృతజ్ఞతాపూర్వక వందనశతంబు లర్పించుచున్నాను. ఇది నా దేశము, ఇది నా గ్రామము, అను నభిమానము లేని నరుఁడు బ్రదికియున్నను మృతతుల్యుఁడే. దేశాభిమానము లేని

నరుని సచేలదహనము చేసినను పాపము లేదని మా తండ్రిగారు వాకొనుచుండెడివారఁట. శత్రుసమూహములు స్వదేశసంస్థానములఁ జుట్టుముట్టిననాఁడు పరబలాపేక్షతో నుపేక్షించి యూరకుండుటకంటె సమయము దొరకినప్పుడే శత్రుసంహారణముఁ జేయుట వీరునికుత్తమమార్గము. ఆప్తులారా! సాటి సంస్థానాధీశ్వరుల సాహాయ్యమపేక్షించి మనము సాహాయ్యమునకుఁ బోసక్లే వారుకూడ మనము సానుభూతిని జూపుట మానితి మని తలంచి సాహాయ్యమునకై పోవుట మానెదరేమో! అట్టియెడ నొకరికొఱకు వేఱొకరు కనిపెట్టుకొనియుండఁగా నడుమ నక్బరు చిత్తూరు ముట్టడించి కొల్లగొట్టుకొని పోవలసినదియా? నేఁటి యాపత్తు మనకుఁ గాదు కదా యని మన మూరకొనిన రేపీ యక్బరు మన శైలాస్పసంస్థానముపైకి లంఘించునప్పుడు మనకుఁ దోడ్పడువా రెవ్వరు? కావున మనకు దొఱకిన యీశుభసమయమున శాత్రవదుర్భేద్యమైన చిత్తూరుకోటను మనమే వశముచేసికొని ఆయక్బరుతోఁ బోరుదుము గాక. మామగారూ! ఏకలింగేశ్వరస్వామిని నాహృదయమున నిల్పుకొని చిత్తూరును గాపాడ నిశ్చయించుకొంటిని. మీరు చిత్తూరుసామంతరాజులు గాకపోయినను దేశసేవాభిలాషతో మాకు చేయనున్న

సాహాయ్యమునకు నేను సంతోషించుచున్నాను.

వీరా—పృథ్వీసింహా! మనము సైన్యసమేతులమై యిప్పుడే తరలి చిత్తూరు నాక్రమించుకొని యక్బరుతోఁ బోరుదుము గాక! గోపాలసింగ్! నీ విప్పుడేగి, సర్వసైన్యముల నాయత్తపఱుపుము. నాల్గువందల యశ్వదళము మా వెంట బయలుదేఱునట్లును, మిగిలిన పదాత్యశ్వదళ సైన్యములు నేఁటి రేయి బయలుదేఱి రేపటి యుదయమునకుఁ జిత్తూరులో మమ్ముఁ గలియునట్లుగను నాజ్ఞాపింపుము. నీవు పోయి రమ్ము.

రామ—వీరాసింగుగారూ! ఇది దుర్ముహూర్త ప్రవేశసమయము. కావునఁ గొంచెముసేపాఁగినపిదప, వారిని బంపుదురు గాక!

వీరా—ఏమి? దుర్ముహూర్తప్రవేశసమయమా? ధనమదాంధతఁ గ్రిందు మీఁదెఱుఁగక త్రుళ్ళిపాటున వచ్చిన శాత్రవుని నామోచ్చారణ సమయమే వానిని జీల్చి చెండాడి రుధిరపానమున సుఖించి సంతసింపవలసిన సుముహూర్తసమయము. హిందూరాజుల భంజించి, హైందవనారీమణుల వంచించి, భారతీయధనప్రవాహము పరదేశములఁ బ్రవహింపఁజేయ నాసేతుశీతాచల మేకచ్ఛత్రాధిపత్యమునఁ బరిపాలింపఁదలఁచిన పరరాజుల నామస్మరణ సమయమే వారి వంశ మరణ మహోత్సవ

మునకు సుముహూర్తసమయము. ఇంకను దుర్ముహూర్తములా?—ఏమి పుట్టాసింహా!

పుట్టా—సత్యమునే వచించితిరి. చేయఁబోవునదియే భీభత్సకార్యమైనప్పుడు దానికి దుర్ముహూర్త సుముహూర్త ప్రసంగములేల? నే నిప్పుడే సైన్యంబుల సమకూర్చుకొని శత్రుహృదయవిదారణముఁ జేయ నేగుచుంటిని. భరద్వాజామాత్యా! మీరు ఖేల్వానగరంబునకుం జని, గజాశ్వరథాదిసైన్యంబు లెల్ల బయలు దేఱున ట్లొనరింపుఁడు. ఖేల్వాసంస్థాన సంరక్షణార్థ మైదువందల యశ్వదళ ముంచి మిగిలినదళమును రే పుదయమునకే చిత్తూరు చేరునట్లు మాబావయైన గోరాసింగుతో మా యాజ్ఞగాఁ దెల్పుఁడు.

భర—ఏలినవారి యాజ్ఞానుసార మొనర్చెదను.

పుట్టా—మఱియొకమాట: ఖేల్వాచిత్తూర్ధులమధ్య నంచెతపాలవారిని నియమించి యెప్పటికప్పుడు క్షేమసమాచారములు చిత్తూరునకుఁ దెప్పించుచుండుడు.

భర—చిత్తము. నే నిప్పుడే పోయి సర్వమును నాయత్తపఱచెదను. నా కేమియాజ్ఞ?

పుట్టా—మాతల్లి మీరాబాయిగారు రణమునకు రాకున్న మీరును ఖేల్వాయందే యుండి, రాజకార్యములఁ జక్కఁగ నిర్వహించుచు నేవేని లోపములున్నఁ దీర్చుచుండుడు.

భర—చిత్తము. (నమస్కరించి నిష్క్రమించును.)

పుట్టా—ఠాకూర్ సింగ్ ! నీవు శీఘ్రమే ఖేల్వాకు జని యిది వఱలో సైన్యశిక్ష నందియున్న వేయిమందినిగూడఁ దీసికొని వలయు దస్తు సరఫరాలతోఁ దత్క్షణమే తరలి వచ్చి మమ్ములఁ జిత్తూరులోఁ గలిసికొనవలెను. పోయి రమ్ము.

ఠాకూ—చిత్తము. (నిష్క్రమించును.)

పుట్టా—రామభట్టోజీ ! పావము ! మనపట్టణమునందలి పెద్ద లందఱును నావివాహమహోత్సవములోఁ బాల్గొన విశేషప్రయత్నములలో నుండెదరేమో! వారు చేయఁ దలంచిన కృత్యములకే నెంతయు సంతసించితి నని తెల్పి, మాగృహలక్ష్మిని విజయలక్ష్మినిఁ గూడఁ గొని తెచ్చి వారియాశీర్వచనములకుఁ బాత్రుఁడ నగుదు నని తెల్పుము.

రామ—చిత్తము. (నిష్క్రమించును.)

పుట్టా—పితాజీ! క్షమింపవలెను. పితృవ్యులైన మీయభిప్రాయమును నతిక్రమించి ప్రవర్తించుచున్నందులకు క్షమింపవలెను. స్వదేశసంరక్షణము నరునకు ధర్మమైన ప్పుడు, రాజపుత్త్రునకు—విశేషించి క్షాత్రవభంజనోద్యోగియై సాటిరాజపుత్త్రులచే సాహాయ్యమున కాహ్వానింపఁబడిన రాజపుత్త్రునకు—స్వదేశసంరక్షణము

విధ్యుక్తధర్మము గాదా? కావున నాధర్మమును నేను స్థాపింపఁ దలఁచుకొని మీయాజ్ఞల మీఱినందులకు క్షమింపుఁడు. ఇప్పుడు మీసాహాయ్య మభ్యర్థించు చున్నాను.

ధర్మా — బాబాజీ! నీదేశసంరక్షణదీక్ష శ్లాఘింపఁ దగియున్నది. రేపుదయమునకు సర్వసైన్యముల సమకూర్చుకొని నీసాహాయ్యార్థమై వచ్చెదను. మన సామంతరాజులకును జమీందారులకును సైన్యములఁ బంపవలసినదని నీయాజ్ఞగాఁ దాఖీదుల వ్రాసి యంచెతపాలపై నేఁడే పంపి, వారినెల్లఁ బోరున కాయత్తపఱచెద. కాని- బాబాజీ! ఒక్కమాట: సంధికై సర్వవిధములఁ బ్రయత్నించి యేవిధముననైన నీపోరు తప్పింపుము. కార్యము మించిననాఁడు గాని కయ్యమున కియ్యకొనకుము.

పుట్టా — పితాజీ! నేఁడే యుద్ధప్రారంభము జరుగదు. రేపటి యుదయమునకు మీరే వచ్చుచున్నారు. రాయబారము మీరే స్వయముగా నడుపుదురుగాక! ఇందు మా మామగారి సాహాయ్యమును మిక్కిలి కోరుచున్నాను.

వీరా — పుట్టాసింహా! నాసాహాయ్యమును నీ వెన్నఁడును గోరుకొననక్కఱలేదు. నా సర్వసైన్యములు నీయధీనమందుంచియుంటిని. గోపాలసింగు సమరసన్నాహము లన్ని

యుఁ జేసి రేపటియుదయమునకు మనలను జిత్తూరులోఁ
గలిసికొనును.

పుట్టా—మీసాహాయ్యమునకు నేను మిక్కిలి సంతోషించు
చున్నాను.

వీరా—నారాయణామాత్యా! మీ రిచ్చటనే యుండి, రాజ
కార్యముల నిర్వహింపుఁడు. మాప్రతినిధులుగా నున్న
మీరు మేము లేనిలోపమును తీర్చి, ప్రజలను జక్కఁగఁ
బరిపాలించుచుండుఁడు. చిత్తూరునకుఁ బోవుచున్న
మేము విజయమును గాంచితిమా సరియే. కాకున్న
మా బాలుని మీ చెంతనే యుంచుకొని వానిని సంర
క్షించుచుఁ గనుపెట్టుకొనియుండి వాఁడు దక్షుఁడైన
పిదపఁ బట్టభద్రునిఁ జేయుఁడు. ఈలోపున శత్రులెవ
రేని దండెత్తివచ్చి మనకోటను ముట్టడించిరా, రాజ
పుత్రుల కులగౌరవముల మాత్రము నిలువఁబెట్టఁగోరు
చున్నాను. సర్వవిషయములును మీకే తెలియును.
నేను వేఱె చెప్పనక్కఱ లేదు. పుట్టాసింహా! నే నిప్పుడే
యంతిపురికిఁ జని మనప్రయాణవార్తఁ దెలిపి వచ్చెదను.

పుట్టా—మామగారూ!—

వీర—ఏమి పుట్టాసింహా?

పుట్టా—(సిగ్గుపడి యూరకుండును.)

వీరా—బాబా! నీవు సిగ్గుపడుచుంటి వేమి? నీవు నీభార్య కే విషయమైనఁ జెప్పఁదలఁచుకొనినఁ దెలుపుము. నేఁ బోయి తెలిపి వచ్చెదను.

పుట్టా—(మెల్లగ) పోనిండు. వలదు—వలదు.

వీరా—పోనిమ్ము. నాతో నంతిపురి కే వత్తువుగాని-

పుట్టా—వలదు వలదు. జయలక్ష్మీసందర్శనముఁ జేసికొనినఁగాని నూత్నవధూవదనసందర్శనముఁ జేయఁజాలను. కాని—

వీరా—బాబాజీ! ఏమి చెప్పఁదలఁచుకొంటివో తెలుపుము. సిగ్గేల?

పుట్టా—తెలుపుట కేమున్నది. పవిత్రమైన బ్రహ్మచారిగా నుండి నేను నామాతృదేశారాధనము చేయ సంకల్పించుకొంటిని. కాని విధిప్రేరణమువలన మాకు వివాహము జరుగవలసివచ్చినది. నాయట్టి వానిని వివాహముచేసుకొనుటచే మీ రాణాబాయికి వివాహదినముననైనఁ దన నూతనవరునిఁ జూచుకొను భాగ్యము లేకపోయినది. రానున్న సంకులసమరము నాఁపుటకు బ్రహ్మకైన శక్యముగానప్పుడు కయ్యము సంభవింపక తప్పదు కదా! అందు జయాపజయంబులు ముందుగ మనము నిర్ధారణచేసి చెప్పలేము. జయము చేకూరెనా, చెప్పనక్కఱ లేదు—కాక అపజయము చేకూరెనా,

చెప్పవలసిన దేమున్నది? రాణాబాయికి భూలోకనరకమే. (కొంచె మాఁగి) నేనప్పు డేమియుఁ జెప్పఁదలఁచుకొనలేదు. మామగారూ! మీ రేమియుఁ జెప్పవలదు. మీ రంతిపురిలోని రాణాబాయితో నాప్రసంగమేమియుఁ దీసికొనిరావలదు. (కొంచెమాఁగి) ఆమెను మఱవవలదంటిననియు, స్వదేశసంరక్షణమే కర్తవ్యముగాన నదే చేయఁబోవుచుంటిననియుఁ దెల్పుఁడు. అదిమైన నామెహృదయమును ముందు పరిశీలించి చెప్పుఁడు. నేను కఠినుఁడను. ఆమెకు హృదయతాపముఁ గలుగఁజేయుదునేమో! (కొంచెమాఁగి) ఏమియును దెలుపవలదు. నే నామె కేమియుఁ జెప్పలేదనియే తెలుపుఁడు. "నానాథుఁ డంత నిర్దాక్షిణ్యచిత్తముతో నేగెనా?" యని పృచ్ఛించిన నేమి చెప్పుదురు? ఏమో నా కెందుల కావిషయము? నాకై యొక్క వనితబ్రదుకు నిరర్థకమైపోవునేమో యని విచారించుచుంటిని గాని—కాని—మామగారు!—నాకు సెల వొసంగుఁడు. రౌతు కనిపెట్టుకొని యుండెను. నేను పోయివచ్చెదను. మా అమ్మగారియొద్ద ననుజ్ఞఁ దీసికొని యిప్పుడే నే తరలెదను. పెద్దలందఱకు నానమస్కారములం దెలుపుఁడు. రాణాబాయికి-రాణాబాయికి—వలదు-వలదు—ఏమియుఁ దెలుపవలదు. ఆమెను స్మరింపలేదనిమాత్రము తెలు

పుడు. పోయి రండు.

వీరా—పుట్టాసింహా! నీ వింత యస్థిమితతతో నుంటి వేమి ?

పుట్టా—నా కేమియు మనస్స్వస్థత లేదు. నే నేమి మాట్లాడు చుంటినో యెఱుంగకుంటిని.

వీరా—పుట్టాజీ! అస్వస్థతగా నున్నప్పుడు రణమునకుఁ గడం గుట యెందులకు ? పోనిమ్ము.

పుట్టా—కాదు, కాదు. మన మిప్పుడు రణమునకుఁ బోక తప్పదు. నేను మాతల్లిగారి యాజ్ఞ తీసికొనివచ్చెదను. మీరు రంతిపురికిఁ బోయి రండు.

వీరా—మంచిది. పోయి రమ్ము.

(ఇరువురు చెరియొకప్రక్కకు నిష్క్రమింతురు.)

(తెరపడును.)

—

# ౩వ రంగము.

ప్రదేశము:—కోటలో అంతఃపురము.

ప్రవేశము:—పుట్టాసింగు, తల్లి మీరాబాయి.

పుట్టా—అమ్మా! ఏటిమాట లివి? నేను యుద్ధమునకుఁ బోవుదును. అనుజ్ఞ నిమ్ము.

మీరా—వలదు; వలదు. నీవు యుద్ధమునకుఁ బోవలదు.

పుట్టా—అమ్మా! అమ్మా! ఇటు చూడుము; ఇటు చూడుము. నీవేనా నన్ను యుద్ధమునకుఁ బోవల దని శాసించునది?

మీరా—ఔను- మీరాబాయియే నిన్ను యుద్ధమునకు వెళ్లవల దని శాసించుచున్నది— తెలిసినదా ?

పుట్టా—అయ్యో! అయ్యో! యుద్ధమునకు వెడలకుండ నింటఁ గూర్చుండి న న్నేమి చేయుమనెదవే తల్లీ!

మీరా—హుఁ—రాణివాసస్త్రీలకు, ఉపచారము సేయుచుండుము.

పుట్టా—అమ్మా! ఇట్లేల నన్నెగతాళి చేసెదవు?

మీరా—ఎగతాళి కాదు—సత్యమునే వచించుచుంటిని.

పుట్టా—నమ్మను. నేను నమ్మను. నమ్మలేను.

మీరా—నమ్మినను సరే, నమ్మకున్నను సరే—నీవు మాత్రము యుద్ధమునకు వెడలరాదు.

పుట్టా—వినఁజాలను, వినఁజాలను. దేశదాస్యవిమోచనదీక్షఁ బూనిన నాకు నీవాక్కులు హృదయభేద్యములు కావా తల్లీ!

మీరా—దేశదాస్యవిమోచనదీక్ష కాదు. అంతఃపురనారీ విలాసానలోకనదీక్ష—వనితా కటాక్ష వీక్షణ నిరీక్షా పేక్ష—కాదా?

పుట్టా—హరి హరీ! హరి హరీ! అమ్మా! ఏల నీనిశిత వాక్శరపరంపరలచే నన్ను హత్య చేయుచున్నావు?

మీరా—నేనా హత్య చేయుచున్నది?—నేనా హత్య చేయుచున్నది? నిష్కళంక, నిర్మల, నిరుపమాన నిస్తంద్ర రాజపుత్త్రక్షాత్త్రమును నిర్వీర్యముగఁ జేసి, నిస్సత్వముగఁ జేసివైచినది నీవే—నీవే.

పుట్టా—నన్నేల దహించి వైచుచున్నావు? నాహృదయము చీలిపోవుచున్నది. క్షమియింపవా? ఆత్మహత్యకైన—

మీరా—ఆత్మహత్య—ఆత్మహత్య చేసికొనెదవేమి? స్త్రీలు చేసికొను నాత్మహత్యను స్త్రీతుల్యుఁడవగు నీవు చేసికొనెద ననిన దోషము లేదు. పరరాజులు దండెత్తి వచ్చినప్పుడు, భార్యకై వెనుకఁ జూచు పరమనిర్భాగ్యుఁడవు నీ వాత్మహత్య గాక యింకేమి చేసికొనెదవు? దిక్కులేని ప్రజల దీనాలాపములఁ జదివియు నతివకై యంతఃపురమునకు వర్తమాన మంపు శూరాగ్రేసరచక్రవర్తివి

నీ వాత్మహత్య గాక యిం కేమి చేసికొనెదవు ? అంతః
పురమునకు వర్తమానించినవాఁడవు నీ భార్యనే యుద్ధ
మునకు వెడలవలసిన దని చెప్పి నీ వింటఁ గూర్చుంటివి,
ఆత్మహత్యయో, యధ్యాత్మరామాయణకీర్తనపఠన
మో చేసికొనలేకపోయితివా ? నీకంటెఁ జిన్నదియై,
యబలయై, యజ్ఞురాలై, యుద్ధనైపుణ్యమైన విశేష
ముగ లేని నీభార్యను యుద్ధమునకుఁ బంప—ఆరాణా
బాయి విజృంభించి—శత్రుగర్వనిర్భేదముగా నాహవ
మొనరించి కీర్తిని గణించి తెచ్చికొని వచ్చినప్పుడు—
మంగళపుటారతికో దృష్టితీయుటకో యేర్పాటులఁ
జేయఁదలఁచుకొనిన నీవు, ఆత్మహత్య గాక యింకేమి
చేసికొనఁగలవు? నీయట్టి మేడిపండు— నీయట్టి పురుష
రూపధారి యైనవనిత—ఛీ, ఛీ—నిన్ను వనిత యనిన
రాజపుత్రవనితాలోకమునకుఁ గూడ నగౌరవమును
నపకీర్తిని దెచ్చినదాన నగుదు నేమో ?—అగుదును.
నీయట్టి పేడి, నీయట్టి జీవన్మృతుఁ డింటఁ గూరుచుండి
యాత్మహత్య గాక యింకేమి చేసికొనఁ గలఁడు ?—
ఇదిగో ! ఇదిగో ! తీసికొనుము. ఈఖడ్గమును దీసి
కొనుము. నీయట్టి పౌరుషహీనులు, నీయట్టి వనితా
లోలురు నీరాణాబాయికడుపునఁ గూడఁ బుట్టి పూత
భారతవర్షమునకుఁ గళంక మాపాదింపకుండ, నీయట్టి

వాఁ డాత్మహత్య చేసికొనిన మేలు.

పుట్టా—హా! హా! (అని విస్మృతుఁడై తల్లి పాదములపైఁ బడును.)

మీరా—(మెల్లగఁ దట్టుచు) లెమ్ము. లెమ్ము.

పుట్టా—(లేచుచు) అమ్మా!- అమ్మా! నే నింకను జీవించియే యుంటినా?

మీరా—జీవించియే యుంటివి; జీవించియే యుంటివి; ఖేల్వాస్థానమునకుఁ గళంక మాపాదించుటకు జీవించియే యుంటివి!—చాందావంశస్థులకుఁ దలవంపులు కలుగఁ జేయుటకు జీవించియే యుంటివి!—నాగర్భమునకుఁ జిచ్చుపెట్టుటకు జీవించియే యుంటివి!—రేపటి రణములో రాణాబాయిపైకి దృక్కులఁ బ్రసరింపఁజేసి, చిత్తూరురాజ్యలక్ష్మిని అక్బరు హస్తగతము చేయుటకు జీవించియే యుంటివి!

పుట్టా—అది నాదోషమే- అది నాదోషమే. సహజస్త్రీచాపల్యమున రాణాబాయి తనతండ్రిని నే నేమైన సమాచారమును జెప్పితినేమో యని కనుఁగొననెంచి ప్రశ్నించినప్పుడు, మామగారు పుట్టా యేమియు వర్తమానము చేయలే దనిచెప్ప, నేను పాషాణహృదయుఁడ నని రాణాబాయి యనుకొనునేమో యని భయమంది నేను వర్తమానము చేయఁదలచుకొంటిని గాని—కాని-

కాని—నాదౌర్భాగ్యమి ట్లుండఁగా నే నేమియుఁ జేత కానివానివలె నిస్సారమై, భావశూన్యమై, రసాభాసమైనవర్తమానమును బంపఁబోయితిని—అది నాదోషమే- అది నాదోషమే.

మీరా—ఇప్పటికైన నీదోషమే యని తెలిసికొంటివి. నీ రసాభాసపువర్తమానము విని నీభార్య ని న్నెట్లు తలఁచునో యూహించితివా ?

పుట్టా—నిజమే. నిజమే. వట్టి చేతకానివాఁడ నని, వట్టి నిస్సారుఁడ నని, యుద్ధ మనిన జంకి యి ట్లింత్యవర్తమాన మంపితినని తప్పక తలంచును.

మీరా—చూచితివా, నీరసాభాసమైనవర్తమానము వినిన నీభార్య నిన్ను యుద్ధభీరునిగా నెంచి చులకనగాఁ జూచునప్పుడు, నీ వేమిచేయఁగలవు ? నీ భార్యకు నీవీరత్వము వెల్లడియైనప్పుడు, నీరససాంకర్య సంభాషణావైదుష్యము విస్పష్టముగాఁ దెలిసినప్పుడు, నీసన్నికర్షణసమరసన్నాహసంరంభసమయజనితమనఃస్థైర్యశైథిల్యమును జెప్పనక్కఱలేకయే తెలిసికొనఁ గలిగినప్పుడు, నీకగు చిన్నతనమును, సిగ్గుపాటును, తలవంపును, నిస్సారతయును దలంచుకొంటివా ? చాందావంశస్థు లెన్నఁడైన నిట్టి పరిహాసమునకుఁ బాల్పడిరా ? సాటి రాజపుత్త్రు

లెవ్వరైన క్రేలు మడఁచి యిది ఖిల్జీప్రభువుల లోప మని చెప్పఁగడఁగిరా? అట్టియెడ—నీనాఁటికి—నీ వర్తమానముచే—నీచేఁతకాని వర్తమానముచే—నీ మామగారు నీమొగమున కెదురుగ పకాలున నవ్వవలసినదా! నిన్ను యుద్ధమునకుఁ గడంగవల దని యుపదేశింపవలసినదా! ఇది యెవరిలోప మని యెన్నుకొనుచున్నావు?

పుట్టా—ఇంతకును గారణభూతుఁడను నేను కాన, ఆలోప మంతయును నాదే యని తలంచెదను.

మీరా—మున్నాటికిని యాలోపము నీదే; ఆలోపము నీదే. అట్టిలోపముల నీచెంత నిడుకొని రణమునకుఁ గడంగుట కంటె వెడలకుండుటయే మేలు కాదా?

పుట్టా—(కొంచె మాఁగి) నిజమే. నిజమే.

మీరా—ఇంకను రణమున కేగెదవా?

పుట్టా—నాలోపము నేను సవరించుకొనిన్నైన రణమునకుఁ గడంగరాదా?

మీరా—ఎట్లు సవరింపుకొందువు?

పుట్టా—శత్రుసంహార మొనర్చి జయలక్ష్మి నందిననాఁడు గాని—నీమోమును రాణాబాయిమోమును జూడ నని నీపాదము లంటి ప్రమాణము చేయుదును.

మీరా—పుట్టా! ఆఁగుము. నీభార్య యుద్ధమునకు వచ్చిన

నచ్చట తిరిగి యీరసాభాసనంభాషణము ప్రారంభిం
చెద వేమో ?

పుట్టా — అ ట్లెన్నఁడును జరుగదు. వీరరసప్రధాన మైన నా జీవితనాటకములో నిఁక శృంగారమునకుఁ దావు లేదు. నాజీవితములో నట్టి రససాంకర్యము గలుగదు. నీ కనుమానము వలదు. పుట్టిననాటఁగోలె నేనెట్టి యస్ఖలిత బ్రహ్మచారిగా నుంటినో యీచిత్తూరు యుద్ధాంతము వఱకు నట్లే యుండి దేశదాస్యవిముక్తికై ప్రయత్నించెద. శత్రుసేనావార్నిధికిఁ జెలియలికట్టనై నిల్చెద. దయాదాక్షిణ్యము లెఱుంగని యీఖడ్గధార శాత్రవ కంఠలతాలవిత్రమై, రిపుభుజంగ భంజనసుపర్ణమై, పర సేనారణ్య దావాగ్నికీలమై, మృత్యుజిహ్వాకరాళమై, నిజకీర్తిప్రతాపోదయసాధనమై ప్రకాశించెడుఁ గాక !

ఇది యాభీలనిశాతచండరుచివక్రిహ్నిజ్వాల యానేని, యియ్యది సుక్షత్రియవీరవంశ్యఘనపుట్టాఖడ్గ మానేని, దుర్మదదుర్దాంతదురంతదుస్సహారిపుక్రప్రస్ఫీతమస్తాళి నా ఘదనద్వారనిబద్ధతోరణముగా సంధింపలే కుందునే.

అమ్మా ! చతురంగబల సమేతుఁడనై యాహవభూమి కరుగుచున్న నాకు నీయాశీర్వచనము ముఖ్యము. తల్లీ ! నీయాశీర్వచనమునకై నిరీక్షించుచుంటిని.

మీరా—పుట్టా! పదునాలేండ్ల ప్రాయమువాఁడవు, మదేక పుత్త్రుఁడవు, రాజపుత్త్రుఁడవు నైన నిన్ను నేనిదే యాశీర్వదించుచున్నాను. శత్రువులఁ దునుమాడి విజయము నందుము.

పుట్టా—అమ్మా! నేను నిన్నొక్కటి యభ్యర్థింప వచ్చునా?

మీరా—ఏమది?

పుట్టా—నావెంటఁ జిత్తూరునకు వచ్చి—

మీరా—ఏమో? అప్పుడాలోచించుకొనవచ్చును. తగినంత తొందరపని గలిగిన నట్లే వచ్చెదను. నాయనా! నీవు పోయి రమ్ము.

పుట్టా—అమ్మా! సెలవు. (అని నమస్కరించి నిష్క్రమించును.)

[ప్రవేశము:—రాణాబాయి పురుషవేషమున.]

రాణా—అత్తగారూ! నమస్కారము.

మీరా—మీ రెవ్వరు?

రాణా—మన్నింపవలెను. నేను హీరాసింగు మహారాజుగారి పుత్త్రికను—మీకోడలను.

మీరా—(ఆశ్చర్యముతో) రాణాబాయి! (దగ్గఱకుఁ దీసికొని) ఆమ్మా! యిటు వచ్చితివేమి? నీనాథునిఁ జూచి వెడలిపోవుటకై వచ్చితివనుకొందును.

రాణా—కాదు. కాదు. మీయనుజ్ఞపైఁ జిత్తూరున కేగుటకు.

మీరా—నీ వెందులకు ? నీవు మాట్లాడఁ దలఁచుకొనినఁ బుట్టాను యిక్కడకే పంపింతును లెమ్ము.

రాణా—నేను చిత్తూరునకు వెడలుట నాథుని జూచుటకుఁగాని, మాట్లాడుటకుఁ గాని కాదు.

మీరా—అది యేమి ? రాణాబాయి ! ఇట్లాడెద వేమి ? వివాహమై యొకజాము కాలేదు. ఇంతలోనే ఘట్టా యనిస నీ కంత తేలికయై పోయినదా ?

రాణా—అఖిలభారతమహీపాలలామములకును రణాహ్వాన మగుటచే నేనుగూడఁ జిత్తూరునకుఁ బోవుచుంటిని కాని, నాథుని జూచుటకును సంభాషించుటకును బోవుచుండుట లేదని తెల్పితిని. అంతమాత్రమున కాయనపైఁ బ్రేమ, భక్తి లేనట్లు తలంపవలసిన దేనా ? ఇం దాయనయెడ న్యూనత కేమి యెడ మున్నది ?

మీరా—నాదగ్గఱఁ జెప్పుటకే యీ వాక్యముల ప్రయోజనము—కాని చిత్తూరునకు వెడలినపిదప నీ వీరాలాపములు సరససల్లాపములక్రింద మాఱవా ? అమ్మా ! ఎందులకిట్లు నాతోఁ జెప్పెదవు ? నీయట్టివారిని బెక్కండ్రను జూచితిని. వయసు చెల్లినదానను నా కనుభవ మున్నంతవయసు నీకు లేదు. నీ వూరక నాతో నిట్టివాక్యము లాడకుము.

రాణా—నన్ను క్షమింపుఁడు. ఏకలింగేశ్వరస్వామిపాదము లంటి మీపాదము లంటి చెప్పుచున్నాను. నా కీషన్మాత్ర మైన పట్టితలంపు లేదు. రణరంగమున శాత్రవగర్భనిర్భేదము గాఁబోరి హైందవనారీమణుల ప్రాణసంరక్షణము చేయ వలసిన సమయము వచ్చినదని నాతలంపు. మాతండ్రి యే నన్ను రణమున కాయత్తపఱచినాఁడు. చిత్తూరు రాజ్యలక్ష్మి తనకరపల్లవములచే నన్ను సాహాయ్యము నకు రమ్మని యాహ్వానించుచున్నది. యుద్ధము సేయుట నెఱింగియు నింట గూర్చుండలేక మీయనుమతిఁ దీసి కొని వెడల నిటు వచ్చితిని. నానాథుఁడే స్వయముగ సైన్యముల నడిపించుకొని యుద్ధమునకుఁ బోవుచున్న ప్పుడు నేను వారి కర్ధాంగినై యుండి సర్వావస్థలయం దును వారినే యనుసరించి యుండవలసినవిధి యున్నప్పు డుగూడ జిత్తూరునకు బయలుదేఱుటకు ప్రత్యేకించి వారి యనుజ్ఞ తీసికొననక్కఱలేదని తలంచి వృద్ధత్వకారణ మున రణభూమికి రాక యింటికడనుండు మీయాశీర్వ చనము నందుట ముఖ్యమని తలచి యిటు వచ్చితిని.

మీరా—మాపుట్టూకుకూడ నీవనిన పంచప్రాణములును. నిన్నుఁజూచి యాతఁడు రణమును మాని చిత్తూరును పరుల హస్తగతము చేయునేమో యని సంశయించు చున్నాను.

రాణా — నేఁటివఱకు నేను వారిదృష్టిపథమునఁ బడలేదు. రేపు పడినను నన్ను వారు గుర్తింపలేరు. మాతండ్రిగారి చెంతనే యుండి రణ మొనరించుచున్నప్పుడు—

మీ రా — కానీ, నిన్నెఁఱిగినవా రెవరైనఁ బుట్టాతో నీవిషయ మును గూర్చి తెలిపిన ?

రాణా — నేను పురుషరూపమున నున్నప్పు డన్యు లేల నన్ను గుర్తింపఁగలరు ? మఱియు నేఁటిదనుక నేను మాతండ్రి గారిని దప్ప పరపురుషుని జూచియుండలేదే ! ఇట్టియెడ న న్నన్యు లెట్లు గుర్తింపఁగలరు ?

మీరా — సరియే—తల్లీ! మాపుట్టాసింహుఁడు నన్నుఁగూడ రణ మున కాహ్వానించియున్నాఁడు. రేపటియుదయమున నన్ను వెంబడించెదవుగాని లెమ్ము.

రాణా — మీయాజ్ఞాపాశములచే బద్ధురాల నైతిని.

మీరా — (ఆకస్మికముగా) నీకు పుట్టా యేమని వర్తమానించి యున్నాఁడు ? మీతండ్రిగా రావిషయమేమైన నీతోఁ జెప్పియున్నారా ?

రాణా — మాతండ్రిగా రేవిషయమును నాతోఁ జెప్పియుండను లేదు—నేను నానాథుఁ డేమైన వర్తమాన మంపినారా యని ప్రశ్నించియుండను లేదు.

మీ రా — అదియేమమ్మా ! విపరీతముగ నున్నది. నిన్నింటికడ విడిచి యుద్ధమునకు బోవుచున్న నీనాథుని వర్తమానము

కనుఁగొనవలయునని నే నీకు స్ఫురింపలేదా ?

రాణా—రణగీతికలఁ బాడుచు యుద్ధోన్ముఖుఁడై వెడలుచున్న మహాయోధునినోటినుండి వారిబానిసనైన నాకు వేత్రేమి వర్తమానమువచ్చును ? రణమునకు రావలసినదనియే గదా నాకు వారు వర్తమానింతురు! నే నందులకు ముందుగనే సంసిద్ధురాలనై యున్నప్పు డింక వారి వర్తమానము కొఱకు వేచియుండ నక్కఱలేదు గదా?

మీరా—అమ్మా! నీనాథునియనుమతి నీవు తీసికొన నక్కఱలేదు. సరే కాని- నీతండ్రిగారు నీప్రయాణమున కను మతించి యున్నారా ?

రాణా—నేను వారి యనుమతి బడయ నక్కఱలేదు.

మీరా—అదియేమి ?

రాణా—చిన్నప్పటినుండియు మాతండ్రిగారు "అమ్మాయీ! నీవు రణభూమిలోఁ జొచ్చి శాత్రవుల నిర్జించి యశము గాంచు" మని చెప్పుచు నాకు రణమర్మముల నన్నిటిని నేర్పించిరి. మఱియు వారమువదినములక్రిందట నీ చిత్తూరు ముట్టడి జరుగునని మాచారులు మాతండ్రితోఁ జెప్పిరి. నే నప్పు డా వార్త వింటిని. మాతండ్రి "రాణా బాయీ! చిత్తూరునకు వచ్చి శాత్రవసైన్యముల నెదు ర్కొని యుద్ధము చేయఁగలవా ?" అని నన్నుఁ బ్రశ్నిం చెను. నేను తప్పక చేయఁగల నని సమాధాన మీ

యంగా వారు సంతసించి "ఈలోపున నీకు వివాహము కాకున్న నా వెంటనే రావచ్చును. వివాహ మైనయెడల నీభర్తవెంట వెడలవచ్చును" అని వారు నవ్వుచు నాకుఁ బ్రత్యుత్తరమిచ్చిరి. నేఁటికీదాఁడి యథార్థ మగుటచే నేను రణమున నిలిచి నాస్వదేశసంరక్షణము చేసికొనఁగల ననుధైర్యముతో ముందే రణమున కాయత్తపడితిని.

మీరా—అట్లాగునా తల్లీ! పులికడుపునఁ బిల్లి పుట్టునా? పుట్టినయింటికిని మెట్టినయింటికిని గూడ నాచంద్రార్కమైన కీర్తిని గడింపఁగలవమ్మా! నీవలె నేను తీవ్రముగఁ బోరలేను గాని—యేదియో యోపిక యున్నంతవఱకును సమరమును సాగించెదను. నీ వెప్పుడును యీ వృద్ధురాలిని బాసి యుండకుము. వయస్సు మీఱినదాననగుటచే రణభూమిని నీయట్టి జవ్వనులసాహాయ్యము తఱుచు కోరుకొనవలసి వచ్చుచుండును సుమా! కావున నన్నుఁ బాసి యుండకుము. రేపు ప్రొద్దుట బయలుదేఱి పోయి పుట్టాను గలిసికొందము రమ్మమ్మ. లోనికి పోవుదము.

రాణా—చిత్తము. (ఇరువురును నిష్క్రమింతురు.)

(తెర పడును.)

---

అవిఘ్నమస్తు.

# చిత్తోడుపతనము

## ద్వితీయాంకము.

### ౧వ రంగము.

ప్రదేశము:—చిత్తూరుకోటలో దర్బారు.

[ప్రవేశము:—నాగేశ్వరపండితుఁడు, వీరాసింగు, పుట్టాసింగు, ఠాకూరుసింగు, గోరాసింగు ప్రభృతులు.]

పుట్టా—నాగేశ్వరామాత్యా! మనవేగులవా రేమి తెల్పిరి?

నాగే—కొలఁదిసేపటిలో నక్బరుకడనుండి రాయబారులు రానై యున్నారఁట.

పుట్టా—ఇంత పెద్దదండుతో నెదుటఁ గొమ్ముమై గూర్చుండియు రాయబార మెందులకుఁ బంప నున్నాఁడాయక్బరు?

నాగే—సంధికి మన మనుమతింపలే దని దేశచరిత్రలో వ్రాయించుటకుఁ గాకున్న నిప్పు డు రాయబారము నకుఁ గారణ మేమియుఁ గాన్పించుట లేదు.

గోరా—ప్రభూ ! హైందవసంస్థానములు ప్రబలియుండుటయే రాజపుత్రస్థానమందలి వివిధ దేశాధిపతులు కలిసి చేసిన దోషము. మేకపిల్లను బట్టుకొనుటకు వృకమున కెట్టి క్రోధకారణము కలదో మొగలాయీసామ్రాజ్యాధిపతులకు రాజపుత్రయోధులపైఁ గ్రోధముండుట కదే కారణము కలదు. కాని రాజపుత్రులు మేక లని భ్రమించిన యక్బరునకు మనము మేకలమో, సింహములమో యీసారి తెలియఁగలదు.

ఠాకూ—చిత్తూరులోని యువిదలతోఁ బోరలేని యక్బరు కాఁబోవు రణములోఁగూడఁ నబలలను యుద్ధము చేయనీయవల దని బ్రతిమాలుకొనుట కేమో యీ రాయబారమును ప్రస్తుతమునఁ బంపుచున్నాఁడు.

అందఱు—(నవ్వుదురు.)

పుట్టా—ఠాకూరుసింగ్ ! ఇది నవ్వులాటకు సమయము కాదు.

[ప్రవేశము—సేవకుఁడు.]

సేవ—ప్రభూ ! జయమల్లు ప్రభువుగారు వచ్చుచున్నారు.

పుట్టా—(లేచి యెదురుగఁ బోయి జయమల్లును వెంటఁ గొని వచ్చును.)

జయమల్లు—(ధర్మాజీకిని సభ్యులకును నమస్కరించి, పుట్టాను గౌఁగలించుకొనును. పిదప నందఱును గూర్చుండి యుందురు.)

పుట్టా—జయమల్లూ ! రమ్ము. నీ సాహాయ్యము మా కిప్పుడు ముఖ్యము. మొగలాయీ సైన్యముతో నక్బరు వచ్చి తూర్పు దెస గుట్టపై విడిసి యున్నాడు. ఇంక నొక గడియలోపల రాయబారము రానున్న దని వేగుల వారివలనఁ దెలియవచ్చినది.

జయ—మంచిది. పుట్టా ! ఈరాయబారముతో సంధి కుదురు ననియే మీయభిప్రాయమా ?

పుట్టా—ఏమో ? కుదిరినఁ గుదురవచ్చును.

జయ—అట్లెన్నటికిని జరుగదు. కోటలో నెందఱు యోధులు రణోత్సాహు లున్నారో చూచుకొనుటకే యీరాయబారము సంకల్పింపఁబడిన దని నానమ్మకము. సంధియే కోరునెడల నక్బరు సైన్యసమేతుఁడై చిత్తూరు వచ్చి కూర్చుండి రాయబారమును బంపఁడు.

వీరా—జయమల్లుబాబా ! ఇప్పటి రాయబారమున కింతకంటె నెక్కు డర్థము లేదు.

ధర్మా—అట్లనుకొనరాదు. ఏవిధముననైన మనము సంధి కీయకొన్న జననాశనము గలుగదు. ప్రభు వెప్పుడు ప్రజాక్షేమమునే కోరవలెను గదా ! కావున నక్బరుపైఁ గోపముచే నాతని రాయబారమును దిరస్కరింపరాదు.

వీరా—చిత్తూరు విడిచి మీరెల్లరు వలస పోయెదని యక్బరు రాయబార మంపిన మనము చేతులు జోడించుకొని వానికి చిత్తూరు నొసంగి మనము వెడలిపోవలసి నదియా?

ధర్మా—మన మట్లనుకొనరాదు. అక్బరు అంత బుద్ధిహీనుని వలెఁ బ్రవర్తింపఁడు.

వీరా—పరరాజ్యాభిలాషి యైన యక్బరు పనిలేకనే సైన్యముతో వచ్చె నందురా?

ధర్మా—సంధి కుదరకున్న సమరము చేయుటకు సాసిద్ధుఁడై వచ్చెను. అది చెప్పనక్కఱలేకయే తెలియుచున్నది.

[ప్రవేశము—సేవకుఁడు.]

సేవ—ప్రభూ! అక్బరు సంస్థానమునుండి యిరువురు రాయబారులు, సేనాధిపతి, యిరువురు రక్షకులు, దర్శనార్థమై వచ్చియున్నారు.

పుట్టా—రాయబారులను మాత్రమే లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము. (పోయి యిరువురు రాయబారులతోఁ బ్రవేశించును.)

రాయ—(వంగి పుట్టాకు సలాములు చేయుదురు.)

పుట్టా—(తిరిగి సలాము చేయుచు) మీరేనా అక్బరు బాదుషావారికడనుండి వచ్చిన రాయబారులు? మంచిది. ఇటు దయచేయుఁడు.

రాయ—సిత్తం. సిత్తం. (పుట్టాప్రక్క కొంచె మెడముగాఁ గూర్చుండురు.)

పుట్టా—మీ పాదుషావారికిఁ గుశలమా ?

1 రాయ—హేమికుశలమ్ సామీ! హిక్కడ గరమ్ బహూత్ జాస్తీహై ఢిల్లీపాద్షావారిక్కడిక్కి వచ్చిందీ లగాయిత్ బహూతక్లీఫ్ అయిపోయినారు. హందుచే పాదుషావార్కి తమదర్శనానిక్కి స్వయంగా రావాల అనొక్కనీకూడా రాలేకపోయాంక్. అందుక్కి మన్నించవాలా కోర్తాంక్ మానోటితో పాచ్ఛా.

పుట్టా—ఇంత యొడల కోర్చి యీచిత్తూరున కిప్పుడు రావలసినయగత్య మేమి పట్టినది మీచక్రవర్తికి ?

2 రా—దానికి పమూదానమ్మె సెత్తామ్ యివొక్కండి. యింధే పరతాప్కి దచ్చనంమే ఉన్న రాజ్యాలకీ జయించాలనీ మాపాచ్ఛావార్ తలంసి వున్నార్. హక్కడి రాజుల్ జాస్తీలష్కర్ గల్గివుంటార్ విన్నామ్. రాజుపుత్రుల సాయం లేకపోతే వారిని గెల్వటం అబద్ధం గనక్క మీసాయం కోరడంకై వచ్చినారు పాచ్ఛావారు స్వయంగా.

పుట్టా—(జనాంతికముగా) నాగేశ్వరామాత్యా! వీనిసంభాషణక్రమ మెట్లున్నదో యాలింపుఁడు.

నాగే—(జనాంతికముగా) ఇదియంతయు నాటకము.

1 రాయ—పాచ్ఛావార్ మీకోటి హింకోటీ వ్వయంగా మన్వి చేయుమన్నార్. రాజ్పుత్రుల్ హీసారి వహాయమ్ చేయక్పోతే పాచ్ఛావారికీ సాలా సాలా నష్టం వస్తుందీ హని సెప్పినాన్. ఆనష్టం రాకుండా దస్తు సరఫరాల్ సైన్యం మాయెంటనే పంపాలసిందిగా సెక్రవాత్రిగారి హుకుమ్ అయింది.

వీరా—ఇదేమి నిర్బంధసాహాయ్యమా ?

2 రా—హాన్నమాటే సర్కార్ !

ధర్మా—అయిన వారి కిప్పు డెంతసైన్యము కావలెను ?

1 రాయ—హిర్వైవేలూ కాల్బలమ్, హయిద్వేల్ గోడాబలమ్, వెయ్యి యేన్గాబలమ్ పాచ్ఛావారూ కోర్తార్.

ధర్మా—దస్తెంత ?

1 రాయ—దస్తూ యిరవై హైదులచ్చల్ కోర్తార్.

వీరా—ఇక్కడ మీయక్బరుగాని జేబరుగాని దాచిపెట్టినా రనుకొనినారా ? ఇరువదియైదులక్షలు కాదు—అయిదు కాను లియ్యము. మొగలాయీసంస్థానమునకును మాకును ఎట్టిసంబంధమును లేదు. మేము వారికి చిల్లిగవ్వయైన నీయనక్కఱలేదు. మీరు పోయి మీయక్బరుతోఁ జెప్పుకొనుఁడు.

ధర్మా—సాహేబులూ ! ఇంతమొత్త మడిగినఁ జిన్నసంస్థానప్రభువు లొక్కసారి యెక్కడినుండి తెచ్చి మీకీయఁ

గలరు ? ఇట్లగుట మీ పాదుషాకు ధర్మముగ
నున్నదా ?

2 రాయ—ధర్మానికే యెక్కడ్కీ రాజా! పాదుషావారు
హావస్సంకోషం హద్దార్ తర్వాతా మీహిష్టమ్.

జయ—ఇదియేనా మీరాయబారము ? చాల యాశ్చర్య
ముగా నున్నది.

1 రాయ—యేమి హీలా హద్గుతాన్ ?

జయ—పదంతయు మోసము.

2 రా—మోసమ్ మోసమ్మే వచ్చామ్ సర్కార్! అన్యా
యం సెప్తాన్.

జయ—కానున్న మీరాయబారములో నర్థమున్నదా ?

1 రా—అర్థమ్ లేకేం సర్కార్! యిరవై హైదు లచ్చల్
రొఖ్ఖమ్ కోర్తార్ పాదుషావార్, హిరవై యెనుమేలూ
సైన్యం కోర్తార్. హిందూ అర్థమ్ లేదూ రాజా ?

వీరా—ఇం దర్థము గాదు. అనర్థమున్నది.

1 రా—సర్కార్ సెప్పింది యేం భోదపడ్లేద్ సర్కార్.

పుష్టా—నా హేబులూ! మీరాయబారము మా కేమియు
స్ఫురింపనిచ్చుట లేదు.

2 రాయ—మీ పహాయమ్ కోరామ్. అంతే వుంది.

పుష్టా—పరిస్తుతమునకు సాహాయ్యము చేయలేము.

1 రాయ—యిరవై హైదులచ్చల్ సొమ్మైన యిస్తాక్ ? సర్కార్ !

వీరా—ఇదేమి బేర మారంభించినారేమి ?

1 రాయ—బేరమ్ ! హిప్డూ మీరు సాయమ్ చేయక్పోతే ప్రతిపక్షీకి రెండూలచ్చల్ పన్నూ విధించవాల్ పాచ్ఛా.

పుట్రా—మీయక్బ రెవరు మమ్ముల పన్నిచ్చుకొనుమనుటకు ?

1 రాయ—హక్బర్ చక్రవర్తి ఢిల్లీపాచ్ఛా నవాబ్ సర్కార్ !

వీరా—పాచ్ఛా మీకుఁ గాని మాకుఁ గాదు.

2 రా—జాస్తీ బాత్ మత్ కరో. మీరు హిరవై హైదూలచ్చల్ యీయక్పోతే యుద్ధమ్ నిశ్చయమ్.

ఫుట్టా—వేఱుగత్యంతరము లేనప్పుడు యుద్ధము నిశ్చయ మన్న మాటయే గదా ?

అందఱు—నిశ్చయము. నిశ్చయము.

1 రా—హిక్కడ పిన్నలికీ పెద్దలికీ హందరికీ ఒక్కమాటా సెప్తామ్ ఇనోకొండి. అక్బర్ పాచ్ఛాగారు దుస్సాహిల్లా అన్నమాట. వారి మంచీ గించీ మీకు హింకా తెల్యాదు. వారిదీ గొప్పజోస్తీ ఉంటే మిమ్మల్ని ధేముడూ కన్నెత్తి చూడా లేదు. వారిదీ ద్వేషం వుంటే హల్లా వచ్చి మీకూ సహాయం చేయాలేడ్. మామాటా

మన్నించీ పాచ్ఛావారితో లడాయికీ తయ్యార్ కావద్దు. లడాయికీ తయ్యారైతేతో మీకు సాలా సాలా కష్టాల్ వస్తాయ్. హొనా హాక్బర్ కాదూ హల్లా వచ్చినా మీకష్టాల్ తీర్చాలేర్. ఇక్కడ ఖైటో చేసిన వారిమాటల్కి యిన్కొని పాచ్ఛావారితో యుద్ధానీకి సిద్ధం అయేతో హొనా చెప్పడానీకి యేమీ లేద్.

పుట్టా—కానున్నది కాకమానదు. అక్బరుతోఁ బోరవలసివచ్చినని వారి కిరువదియైదులక్షలు లంచ మీయఁదలఁచుకొనలేదు.

2 రా—హాయ్యాల్ ! నేనూ వఖ్కమాటా సెప్తాన్ ఇనోంకీ. మీరు మారాయబారానీకి వప్కుంటే మీకే మేల్. మీదగ్గిర హొక్టె-రెండు ఫస్లీలపన్ను వసూల్ చేస్తార్. తర్వాతా మీకూ వదిలీవేస్తార్. హీక్కడవున్న ఛోటాఛోటా సంస్థానాల్కి పన్నూ వసూల్ చేద్దయానీకి సర్కార్ వాకి వుద్దేశం. నేను సెప్పినమాటా యినోక ముందూ తొందర్పడి లడాయికీ దిగ్తేతో మీకీ సాలా నష్టమ్ వస్తాయ్. పన్నూ హిచ్చేస్తే లడాయీ గిడాయ్ లేదు. అందర్ ఖుషీ వుంటార్. పిల్లల్ గిల్లల్ హంతా షేమమ్‌గా వుండండి. మిమ్మల్ని సూస్తే నాకీ జాలీ యేస్తున్నాయ్. హొనా విసారిస్తే లాభం లేదు.

పుట్టా—నీపారసునుగూడ నొప్పగించితివి కాదా? సరే—మీరిక వెడలుఁడు. మావారు వచ్చి మీ పాచ్చావారితో మాట్లాడెదరు. ఇఁక నొక్క-గడియలో వారిని బంపెదము. మీరు పోయి రండు.

రాయ—సర్కారువారి మెహర్బాన్ పూర్తిగా వుండాలి కోర్తామ్. సెలవ్. సెలవ్. (వంగి సలాములు చేయుదురు.)

పుట్టా—నాగేశ్వరామాత్యా! ఈరాయబారులను బహూకరించి సాగనంపి రమ్ము.

నాగే—చిత్తము—అట్లనే. (తురకలతోఁ బోయి తిరిగి ప్రవేశించును.)

పుట్టా—మహాశయులారా! మన సుందఱము నిరీక్షించుచున్న రాయబారము వచ్చుటయు వెడలుటయుఁగూడ నైనది. ఈరాయబారము లాంఛనమునకై యున్నది గాని సంధి సమకూర్చుకొనుటకై కాదు. ఇట్టియెడ మనము వారికి తిరిగి రాయబార మంపవలసి యుండునా? లేక యుద్ధసన్నద్ధులము గావలసినదా? యను ప్రశ్నమునకు సమాధానమునకై మిమ్ముల నడుగుచున్నాను. పితాజీ! మీయభిప్రాయ మేమి?

ధర్మా—బాబా! ఈరాయబారముతో మనకార్యము పూర్తి కాలేదు. అక్బరు ధనము ప్రధానము చేసికొని యీ

వర్తమాన మంపియుండును. కాఁబట్టి వీని కిపువదియై దులక్షలు గాకున్నను గొంతమైన నిచ్చి వీనితో సంధి చేసికొనిన మనకు మేలు. ప్రజలకు హాని కలుగదు; చిత్తూరునకు వినాశము కలుగ దని నాయభిప్రాయము.

పుష్టా—మామగారూ! మీయభిప్రాయ మేమి?

వీరా—ధర్మాజీ చెప్పినదానికి నే నీయకొనను. మన మెట్లేని సంధి చేసికొనవలె నని రెండుమూఁడులక్షల నాణ్యముల నెట్లో ప్రోగుచేసికొని పోయి వాని కిచ్చిన వాఁడందుల కీయకొనక తిరిగి యెక్కుడుమొత్తము గోరినప్పుడు మనము చేతులు జోడించి వానికి సమర్పించుకొనవలసినదా? లేక వానికి బుద్ధిచెప్పుటకై రణమున కియ్యకొనవలసినదా? చిత్తూరును ముట్టడింపవలె నని స్థిరసంకల్పుఁడై సైన్యసమేతుఁడై వచ్చినయక్బరు మన దేవరింతల కీయకొని సంధి కావించుకొని ఢిల్లీకి తిరిగిపోవునా? అక్బరు సంధిచేసికొన నిచ్చట కరుదేర లేదు. సంధియే ప్రధానముగాఁ జూచికొనిన అక్బరు ఢిల్లీనుండియే రాయబారములఁ బంపి యెట్లో సంధి గావించుకొనియుండును. అట్లు గాకపోవుటచే నక్బరునకు ముట్టడిసమయమున జరిగినపరాభవమునకుఁ బ్రతీకారముఁ జేయ సంకల్పించుకొనియే యింత పెద్దదండుతో వచ్చి కోటప్రక్కఁ గూర్చుండియున్నట్లు స్పష్ట మగుచున్నది.

కావున నీవిషయముల జాగ్రత్తతో నాలోచించి, దేశాభ్యుదయమున కనుకూలించు కార్యమును జేయుఁడని కోరుచున్నాను.

పుట్టా—నాగేశ్వరామాత్యా! మీయభిప్రాయ మేమి?

నాగే—ప్రభువులకు నేను చెప్పవలసినవాఁడను గాను కాని, మన మా తురుష్కులతో నొకగడియలో రాయబారులఁ బంపుదు మని చెప్పియున్నాము. కావున మనము కర్తవ్యము మఱవకుండ నెవరిని బంపిన బాగుగ నుండునో పంపు రాయబార మెట్లుండవలెనో మందు నిశ్చయపఱచుకొనిన మంచి దని నాయభిప్రాయము.

పుట్టా—ఔను. నాగేశ్వరామాత్యులు చెప్పినది బాగుగ నున్నది. ముందు రాయబారమున కెవరెవరిని నియమించుదము? పీరాసింగు ధర్మాసింగుగార్ల నిరువురను వెంట జయమల్లును గోరాసింగును బంపిన బాగుగ నుండు నని నాయభిప్రాయము.

అందఱు—బాగుగ నున్నది. వారినే పంపుఁడు.

పుట్టా—పితాజీ! మామగారూ! మీరు సంధి గావించి మమ్ము సంరక్షించెదరో, రణ మొనరించి కీర్తి పొంపొందించెదరో?—మీయిష్టము. భావిరాజపుత్రస్థానగౌరవము మీరాయబారముపై నాధారపడి యున్నది. ఇది యుచితము, ఇది యనుచితము నని మీరు సేయు

కార్యములను బ్రేలుమడఁచి యీసభలోనివా రెవ్వ
రును జెప్పలేరు. ఇది ధర్మ మని మీకుఁ దోఁచిన
పగిది సంధి గావించుకొనియో, రణము నిశ్చయము
చేసికొనియో రండు. మన మిచ్చటఁ బ్రతిదినమును
గూర్చుండి కార్యాలోచనములఁ జేయుటకు నావకా
శము లేదు. కావున మనవారు నలుగురును గూడఁ
జెప్పువాక్యము లాలకించి మీ రేగుడు. ధౌతవస్త్ర
ధారులై ధవళచ్ఛత్రముల ధరించి సంనిపతాకలఁ బట్టు
కొని యక్బరుకడ కేగుడు. నాగేశ్వరామాత్యా! వీరికి
ఛత్రాదులం దెప్పింపుము.

నాగే—చిత్తము. (లోనికిఁ బోవును. వెంట హీరాసింగు, ధర్మ
సింగుఁ గూడ వెడలుదురు.)

పుట్టా—జయమల్లూ! గోరాసింగూ! మీయిరువురి చేతులలో
నీమహానుభావుల సంరక్షణ మున్నది. ఠాకూరుసింగు
మీకుఁ గొంచెము దూరములోఁ గొంత మూలసైన్య
ముతో సంసిద్ధుఁడై యుండును. మీరు ఖడ్గముల ధరించి
కంటికి రెప్ప వోలె వీరిరువురఁ గాచుచుండవలెను.
ఏమైనఁ బ్రమాదము సంభవింపనుండెనా, అక్బరునే
పరిష్కారము చేయుఁడు. ఈలోపున మన ఠాకూర్
వచ్చి మిమ్ములఁ గలిసికొని రిపులఁ జెండాడును. మీరు
పోవుచున్నది శాత్రవశిబిరములలోనికి. మీ వెంట వచ్చు

చున్నవారు రాజపుత్రస్థానమందలి ఘనులు. మీరు వెడలుకార్యము పరమపవిత్రవంతమై— రాజపుత్ర స్థానముయొక్కయు, విశేషించి చిత్తూరు యొక్కయుఁ గీర్తి గౌరవము లాధారపడిన రాయబారము. ఈవిషయము లన్నియు మఱవక దేశకాలపాత్రానుసారముగ మీరొనర్చిన కార్యమునకుఁ బరులే మేలు బళీ యని మెచ్చునట్లుగఁ జేయవలయు నని మిక్కిలి కోరుచున్నాను.

[ పునఃప్రవేశము: హీరాసింగు, ధర్మాసింగు, ధవళవస్త్రచామరాదికములతో వెనుక నాగేశ్వరామాత్యుఁడు. ]

పుష్టా—ఠాకూర్‌సింగూ! మన యాశ్వికదళమునంతను సిద్ధపఱపుము. అప్రమత్తులరై యుండుఁడు. జాగ్రత్త.

ఠాకూ—చిత్తము. (వంగి నమస్కారము చేసి వెడలిపోవును.)

పుష్టా—యోధులారా! గుప్తఖడ్గాదుల ధరించియే పోవుచున్నారు గదా!

ఇరువురు—అట్లే పోవుచుంటిమి.

పుష్టా—మహానుభావులారా!

ధనమా కోశమునందు లేదు; రిపులా కోదర్పించియున్నారు; పా
లనకర్తా చనె; మంచిచెడ్డలవియెల్లం గాంచుమీభారమా
ఘనమైయుండెను; రాజపుత్రులకు సౌఖ్యంబా పథంబందునన్
జనఁగా వేఁడెద; సంధియో సమరమో సాగింపుఁడీ శీఘ్రమే.

వీరా } బాబా! అట్లే చేయుదుము. మేము పోయి వచ్చెదము.
ధర్మా } (నిష్క్రమింతురు.)

జయ } మేమును బోయి వత్తుము (నిష్క్రమింతురు.)
గోరా }

పుట్టా—నాగేశ్వరామాత్యా! మన కాల్బలమును కోటగోడలపైనను బురుజులపైనను నెక్కించుము. ద్వారముల చెంత నశ్వదళమును నియమింపుము. నాల్గుద్వారముల వెలుపలను గజముల నుంచి ద్వారముల సంరక్షింపఁ జేయుము. గ్రామములో కత్తిబట్టఁగల ప్రతిరాజపుత్రుని వచ్చి సైన్యదళములోఁ జేరవలసినదగా చాటఁ బంపుము. వేగులవారి నందఱను బిలిచి యుద్ధానంతరము వఱకు బహుజాగరూకతతోఁ బ్రవర్తింపవలెననియు, శత్రుసైన్యములకుఁ బైనుండి సాధనసామగ్రి రాకుండ జాగ్రత్తగఁ జూచుచుండవలసినదనియు నాజ్ఞలిడుము. రిపుసైన్యములకుఁ జిత్తూరురాజ్యములోనివారెల్లరు నెట్టివిధములైన విక్రయములును చేయరాదని కఠినశాసనము నామాజ్ఞగాఁ గావింపుము. శత్రుసైన్యముల కెవ్వరెట్టిసాహాయ్య మొనర్చినను మరణదండనము విధింపఁబడు నని చాటఁ బనుపుము. చిత్తూరునందలి స్త్రీపురుషు లెల్లరు సంస్థానమునకే సహాయము చేయవలయు నని చాటఁ బంపుము. యుద్ధమైనదనుకఁ

జిల్హానుండి రాకపోకలు కట్టివేయఁబడు ననియుఁ ప్రకటింపుము. ఈపోరు పూర్తి యైనదనుక గ్రామస్థుల కెట్టి యుత్తరప్రత్యుత్తరములు జరుగఁగూడదు. చిత్తూరీవలకే ప్రవేశించిన క్రొత్తవారినెల్ల ఠాణాలలో బంధించి జామీనులపై విడుదల చేయఁబడునట్లు గావింపుము. ఢంకా నౌబత్తు లెప్పుడును మ్రోఁగుచుండవలె నని తెల్పుము.

నాగే—చిత్తము. ఈసర్వవిషయములను మీయాజ్ఞాప్రకారము గావించెదను.

పుట్లా—మాయమ్మగారు వచ్చి చాల తహ వైనదఁట. ఆమెతో నేమియు మాట్లాడ లేదు. మాకు సెలవిమ్ము. లోనికిఁ బోయి వత్తును.

నాగే—చిత్తము.

(అందఱును లేతురు.)

తెర పడును.

# ౨వ రంగము.

అక్బరు కార్యాలోచనసభ.

[ప్రవేశము: మానసింగు, క్షత్రితోడరుమల్, అబ్దులుఫజుల్.]

మాన—అబ్దుల్ ఫజుల్ జీ! మీా అబీనా అక్బరుగ్రంథము నెంతవఱకు రచించితిరి?

అ. ఫజుల్—ఈతేదీవఱకు జరిగినచరిత్ర మాత్రయు వ్రాసితిని.

మాన—మనము అక్బర్ పాచ్ఛాతో ఆఱుమాసములక్రిందటఁ జిత్తూరునకు దండెత్తి వచ్చినప్పటి చరిత్ర యేమని వ్రాసితిరో కొంచెము వినవచ్చునా?

అ. ఫజుల్—చరిత్రములు సమకాలికులకొఱకు వ్రాయఁబడవు. ఎఱిఁగియున్నవిషయములలోఁ దెలిసికొనఁ దగినసంగతు లుండవు. కావున మీా రెఱిఁగియున్న యీావిషయమును గూర్చి నేఁ జదువనక్కఱ లేదని తలంతును.

రాజాతోడరుమల్—చదువకుండుటకు మంచియెత్తు నెత్తితిరి లెండు.

అ. ఫజుల్—అట్లనుకొనకుఁడు. అయినఁ జదివెదను. (ఇట్లు చదువును.)

"అక్బరుచక్రవర్తి ఉదయసింగు రాణాతో యుద్ధము చేయుటకై చిత్తూరునకు రాఁగా మహాపరాక్రమవతి

గ్గమైన కర్ణావతిపుత్రుఁ డయ్యు రాణా రణమున కిచ్చ గింపఁడయ్యె. చిత్తూరు జయింప వచ్చిన యక్బర్ చక్రవర్తికి ఢిల్లీనుండి "రాజకార్యవిషయములలో నొత్తిడిగా నున్నది. శీఘ్రముగ బయలుదేఱి రాఁగోరెదము" అని మొగలాయీసంస్థానోద్యోగులు జాబుల నంపఁగాఁ జిత్తూరు జయింపక చక్రవర్తి ఢిల్లీకి తిరిగి వెడలి పోయెను."

మాన—రాణావారి యింపుడుకత్తె యుద్ధము చేసినను దానింగూర్చి యేమియు నిందుఁ జేర్చలేదేమి ?

అ. ఫ—అక్బరుచక్రవర్తికి జయములు సమకూడిన యుద్ధమును గూర్చిమాత్రమే యీగ్రంథమునందు వ్రాయఁబడుచున్నది; కాని పరులకుఁ గలిగిన జయములఁగూర్చి వ్రాయుట కీపుస్తకము సంకల్పింపఁబడ లేదు.

తోడర్ మల్—(నవ్వుచు) బాగుగ నున్నది.

[ప్రవేశము: సేవకుఁడు.]

సేవ—నవాబ్ సర్కార్ ! అక్బర్ పాదుషావారు సభ కరుదెంచుచున్నారు.

[ప్రవేశము:- అక్బరు. అందఱును లేచి నిల్తురు. అక్బరు కూర్చుండి యందఱను గూర్చుండ నియోగించును.]

అక్బ—మానసింగ్ ! కోటలోనికిఁ బంపిన రాయబారులు తిరిగి వచ్చియున్నారా ?

మాన— వారింకను రాలేదు.

అక్బ—(సాలోచనముగా) ఇంకను రాకపోవుటకుఁ గారణ మేమి? కోటలో వీరికి రాజపుత్రులు పరాభవము చేయ సంకల్పించుకొనలేదు గదా?

మాన— రాజపుత్రు లెన్నఁడట్టివారు కారు. రాజమార్తాండుల పైననే గాని రాయబారులపైఁ జూపు పౌరుషము కాదు వారిది.

అక్బర్— రాజపుత్రుల పరాక్రమము మాకడఁ దెల్పకుము. ఇదిగో! చూచితివా? మనము చిత్తూరుప్రాంతముల కడుగిడకుండఁగనే మీరాజపుత్రవీరాగ్రేసరచక్రవర్తి యుదయసింగురాణావారు పలాయితు లైరి.

మాన— పైవారిపలాయనములు మనకుఁ గాన్పించును. మన పలాయనములు పైవారికిఁ గాన్పించును.

అక్బ— మే మెప్పు డట్టిపని చేయలేదే! అబ్దుల్ ఫజూల్! నీ కెప్పుడైన నట్లొనర్చినట్లు జ్ఞాపక మున్నదా?

అబ్దుల్— అట్లెన్నఁడును జరుగలేదు కావుననే నేను నాగ్రంథ మందు వ్రాయలేదు.

మాన— మనవి పలాయనములుకావు. రాజ్యకార్యములతొందఱ లనుమిషలు. జబ్బు లను వంకలు. అప్పటి కేదియో కారణము చెప్పుకొని ధైర్యస్థైర్యములతో వెనుకకు వెడలుదుము. అంతయే.

అక్బ—మానసింగ్ ! బాంధవ్య మతిసమీప మగుటచే మనకు నీ వెగతాళి నంతత్వరగాఁ జేయుచుందువు.

మాన—పోనిం డిప్పు డాప్రసంగ మేల ? నేఁడు రాయబార మేమని పంపితిరి ?

అక్బ—అబ్దుల్ ఫజుల్ ! నేఁటి రాయబారమును గూర్చి నీ వేమి వ్రాసితివి ?

అబ్దుల్—"ఉదయపుర రాణా వారు పలాయితు లగుటచేఁ జిత్తూరుసంస్థాన మరాజకముగా నుండు ననియు, నాటి రాజపుత్రులు దానిని జీల్చి పంచుకొనెద రనియుఁ దలంచి చిత్తూరు ప్రజలకు క్షేమము గలుగఁజేయవలె నను తలంపుతో నక్బరుచక్రవర్తి యాసంస్థానమును మొగలాయీసంస్థానములోఁ జేర్చుకొని చిత్తూరను గాపాడవలె నని నిశ్చయించుకొని రాయబారమంపెను."

అక్బ—నిజము, నిజము. తెలిసినదా మానసింగ్ !

మాన—రాజపుత్రులు చీల్చుకొనిన మన కేమి ? పంచుకొనిన మన కేమి ? చిత్తూరు సంరక్షించుటకు రాజపుత్రులకు లేనిబాధ్యత మన కేల ?

అక్బ—దేశాభివృద్ధి చక్రవర్తికి ముఖ్యము కాదా ?

[సేవకుఁడు ప్రవేశము.]

సేవ—నబాబ్ సర్కార్ ! తాము పంపిన రాయబారులు వచ్చి ద్వారముకడ వేచియున్నారు.

అక్బ—వారిని బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము. (నమస్కరించి వెడలిపోయి రాయబారులతోఁ బ్రవేశింతురు.)

రాయ—ఢిల్లీ బాదుషా అక్బరు చక్రవర్తికి సలాములు.

అక్బ—ఇటు వచ్చి కూర్చుండుఁడు.

రాయ—(కూర్చుందురు.)

అక్బ—ఏమైనవి మీ రాయబారములు ?

రాయ—సైన్యమును బంపుటకుఁగాని, యిరువదిమైళ్లములకు లూ మొత్తమిచ్చుటకుగాని, సంవత్సరమునకు రెండులక్షలు పేష్కస్ చెల్లించుటకుఁగాని రాజపుత్రులామో దింపలేదు.

అక్బ—అయిన యుద్ధము నిశ్చయమని చెప్పి వచ్చితిరా, లేదా ?

రాయ—చెప్పితిమి. వారుఁగూడ రాయబారులఁ బంపనై యున్నారు.

అక్బ—ఓహో ! వారును వచ్చెదరా ? మంచిది. (కొంచె మాలోచించి) సేవకా ! నీవు పోయి సైన్యాధికారిని రావింపుము.

సేవ—చిత్తము. (పోయి సైన్యాధికారితోఁ బ్రవేశించును. సైన్యాధికారి సలాముచేసి నిలచును.)

అక్బ—(వ్రాయుట నభినయించి సైన్యాధికారి కొసంగును.)

సైనా:—(గ్రహించి చదువుకొని) చిత్తము. సెలవు.

(నిష్క్రమించును.)

అక్బ—రాజాతోడర్‌మల్ ! మనము తెచ్చిన సైన్య మెంత ?

తోడ—నేటియుదయమునకు వచ్చినవి యిరువదైదు వేలు కాల్బలము. మూఁడు వే లాశ్వికదళము. నలువది యేనుఁగులు.

అక్బ—రానున్న దెంత ?

తోడ—నేఁటిసాయంకాలమునకుఁ బదివేల ఫౌజును రేపటి సూర్యోదయమునకుఁ బదునైదు వేల ఫౌజును వచ్చును.

అక్బ—మీరు చెప్పినయుపాయము చాల బాగుగ నున్నది. సైన్యమంతయు నొకేమాఱు వచ్చుటకంటెఁ గొంచెము కొంచెముగా వచ్చుటయే మన కన్నివిధముల మేలు. మానసింగ్ ! మన కీ మేవారుపతులతో యుద్ధము చేయుట తప్పనిపని యగుచున్నది. నీవు ముందుగ సైన్యములఁ బురికొల్పుకొనుచుఁ గోటను ముట్టడింప వలసి వచ్చును. తోడర్‌మల్ కోట వెనుకప్రక్క ముట్టడించును.

మాన—వారిరాయబారములు పూర్తియైనపిదప నాలోచించు కొనవచ్చును. ఒకవేళ రాయబారమే కుదిరిన నీప్రయత్నము లన్నియు నిష్ప్రయోజనము లే కదా !

అక్బ—ఈసారి రాయబారము కుదురదు. యుద్ధము నిశ్చయము.

చిత్తూరు పతన మందితీరవలె. రాజపుత్రగర్వభంజన మయితీరవలె. తప్పదు; తప్పదు.

మాన—ఇంత నిశ్చితాభిప్రాయములు గలవారు ముందు మాత్ర మేల రాయబారమంపినారు ?

అక్బరు—రాయబారము పంపలేదను సిందనుండి తొలఁగుటకు.

మాన—సంధి కోరి కాదా ?

అక్బ—సంధి ? సామంతులతోఁ జక్రవర్తులకు సంధియా ?- కలుగదు—కలుగరాదు—కలనైనఁ గలుగఁగూడదు.—తెలిసినదా ? మానసింగ్ ! ఈయక్బరు క్రోధాగ్ని చిత్తూరు చిక్కుల నంటింపకుండఁ జల్లారునా ? ఈయక్బరుకోపము రాజపుత్రులేకాక చిత్తూరు పురవాసుల రక్తప్రవాహములో స్నాన మొనరించినదాక తగ్గునా ? ఈయక్బరు ద్వేషము చిత్తూరు కోటగోడలపై మొగలాయీ సామ్రాజ్యపతాక మెగురుటో—కాక చిత్తూరుకోట గోడలు నేలమట్టములై పడుటో—జరిగినదనుక చల్లారునా ? రాజపుత్రస్థానయోధులెల్ల రీయక్బరు చక్రవర్తి చరణములకు జోహారులో—ఖడ్గదేవత కాహారములో కావలెఁగాక ! అంతవఱకు నాక్రోధము చల్లారనేరదు. ఈసారితోమైన శత్రుభంజనము జేయలేకుండిన మానె. చిత్తూరు కొండపై యోధుల రుధిరప్రవాహము

ఢిల్లీలోని యమునలో సంగమింపఁజేయుదును గాక ! సర్వమారణతంత్రసాహాయ్యమున శాత్రవగర్వనిర్వాపణమైనఁ జేసెదను గాక ! అంతదనుక నాహృదయమునకు స్వస్థత, శాంతము చేకూరనేరవు. ఇంకను సంధిప్రయత్నములా ? ఇంకను రాయబారములా ?

మాన—ఏమీ ! సర్వమానవసంరక్షకబిరుదాంకితులే— ఇట్లానర్పుట భావ్యమా ?

అక్బ—సకల మహమ్మదీయసంస్థానపోషిత ప్రజాసంరక్షక బిరుదాంకితుఁడ— తెలిసినదా ?

[ప్రవేశము: సేవకుఁడు.]

సేవ—అయ్యా ! చిత్తూరుసంస్థానమునుండి యిరువురు రాయబారులును, ఇరువురు యోధులును వచ్చి ద్వారము కడ నేచియున్నారు.

అక్బ—రాయబారులనుమాత్రము ప్రవేశ పెట్టుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించి ధర్మాసింగు వీరాసింగులతో తిరిగి ప్రవేశించును.)

ధర్మా, వీరా— జయము. జయము.

అక్బ—(నిరాదరణముగా) ఏమిపనిమీఁద వచ్చితిరి ?

వీరా—చిత్తూరుసంస్థానాధిపతులు తమకు రాయబార మంపియున్నారు.

అక్బ—ఏమని ?

వీరా—ఉదయపురరాణావారు చిత్తూరును విడిచి వెడలుటచేఁ బ్రస్తుతము తాము కోరిన యిరువదియైదులక్షలరూప్యములను సమకూర్చి యొసంగఁజాల మనియు, విశేషవ్యయప్రయాసముల నోర్చి తాము వచ్చియుండుటచే నొకలక్షనాణెముల నెట్లైన సమకూర్చి యొసంగఁగల మనియు, నీసొమ్మైనఁ బన్నుగాఁ గాని నజరానాగాఁ గాని యొసంగఁబడక మైత్రి సంపాదించుకొన గౌరవపూర్వకముగా నీయబడు ననియుఁ దమకు మా ప్రభువు మనవి చేయు మనియె.

అక్బ—మైత్రి యేమైన ధనముమూలమున సంపాదించుకొనఁ దలఁచుకొనలేదు.

ధర్మా—మఱెట్లు సమకూర్చుకొనఁ దగునో తెలుపఁగోరెదను.

అక్బ—చూచితిరా యీమానసింగును ?

వీరా—రాజపుత్రస్థానయోధుల శరీరములోఁ బూతహైందవ రక్తము స్రవించుచున్నంతకాలము రాజపుత్రరమణీమణులు మ్లేచ్ఛగృహముల నుంపుడుకత్తెలై బ్రదుకఁజాలరు.

మాన—ఏమి మాటలు! అట్లిచ్చినవారు రాజపుత్రులు కారా? నోటికి వచ్చినట్లెల్ల వదరుచున్నారు జాగ్రత్త !

వీరా—కారు-కారు-మ్లేచ్ఛులకంటె నధములు.

మాన—ఏమి కాఱులు ప్రేలుచున్నారు! (ఖడ్గము దీయం బోవును.)

అక్బ—ఇంతతొందర యేల? కాగలంకార్యమును గంధర్వులే తీర్పంగలరు.

వీరా—నేను కాఱులు ప్రేలుచున్నానా? ఓ దేశద్రోహీ? నీవేమి చేయుచున్నావో తెలుసుకొనుచున్నావా?

వీరులనెల్లం జంపి పృథివిన్ దనమున్నెగ నేల నున్నయీ
క్రూరునియొద్దం జూచుకొనికొనుచు శతనాన మెలంగె దీవు, నీ
వీరము తేటతెల్ల మగునే వే చనుదెమ్మిటు ఖడ్గపాణివై
క్రూరుండ! నీశిరంబిపుడె కొనం గం జేతును కాచుకొమ్మికన్.

ఛీ! ఛీ!! నీయట్టివానిని జంపినం బాప మొడిగట్టుకొందును.

మహితగౌరవమానాభిమానములను
జచ్చునను ద్రోసి జీవించు చెనటి వగుచు
నువిదలను దార్చుకొనిన యుద్యోగి వగుట
బ్రదికియుండియుం జచ్చిన వాండ వీవు.

కావున నీయట్టి వానితో క్షత్రియుల మైన మేము యుద్ధమునకుం గడంగరాదు. పులినాకిన యెద్దుంబోలె బ్రదుకుము. అక్బర్ !!! మేము పోవుచున్నాము.

(నిష్క్రమింతురు.)

అక్బ—మానసింగ్ ! వారికిఁ దగినశిక్ష ద్వారమునొద్ద జరుగును. ఓపిక పట్టుము. రమ్ము. కొంచెము ముందునకుఁ బోయి యాదృశ్యము చూచెదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

తెర పడును.

---

# 3వ రంగము.

ప్రదేశము: అక్బరు విడిసిన డేరాద్వారము దగ్గఱ.

[ ప్రవేశము: లోడీఖాన్, మొహియిద్దీన్ ఖాన్, సంకెలల చేతఁ బట్టుకొని ]

మొహి—అరే ! లోడీ ! లోడీ ! అక్బర్‌పాచ్చా ఫర్మానా యోధులకీ నేనూ సూపుతాన్. నీవు పోయి చేతుల్కి జోడీలు తగిలించు.

లోడీ—నేనూ సూపుతాన్ నీవూ సంకెళ్లు తగ్గించు. సైన్యాని కారీ సూస్తున్నాడ్.

మొహి—యోధులు వస్తూన్నార్ జాగ్రత్త.

[ ప్రవేశము: జయమల్లు, గోరాసింగు, కత్తుల చేతఁబట్టుకొని ]

జయమల్లు—(అపవారించి) గోరాసింగూ ! వీరిరువురు నేదియో కుట్రఁ బన్నుచున్నట్లున్నది. ఒకచేతిలో సంకెలలు నొకచేతిలోఁ గాకితమును పట్టుకొనివచ్చుట చూడఁగా మనల బందీకృతులఁ జేయవలెనని తలంచి అక్బరు వీరిని పంపినాఁడేమో యని యనుకొనుచున్నాను. ఏది యెట్లున్నను ఒక్కపోటున మన మావలఁ బడవలెను.

గోరా—(అపవారించి) మనచెంత వీరియాటలు సాగిరావు. మనవారు వచ్చుచున్నారు. ఇట్టితరుణములో నక్బరు దగ్గఱనుండిన బాగుగ నుండెయుండును గదా!

జయ—అక్బ రంతటిబుద్ధిహీనుఁడు గాఁడు.

[ ప్రవేశము: వీరాసింగు, ధర్మాసింగు. ]

వీరా—బావగారూ! అక్బరునకు సంధి పనికిరాదని ముందుగ నేఁ జెప్పలేదా ?

ధర్మా—మీరు చెప్పితిరి గాని యిప్పుడు మనలోపము తీఱినది.

వీరా—వారుగో! జయమల్లు గోరాసింగును మనకొఱకె కనిపెట్టుకొని చూచుచున్నారు. రండు.

గోరా
జయ } సంధి కుదిరినదా ?

ధర్మా—లేదు.

వీరా—యుద్ధము నిశ్చయము.

(మొహిద్దీన్ ఖాను, లోడీఖాను చెంతకు వచ్చి)

ప్రభూల్! ఇదిగో అక్బర్‌పాచ్ఛావారి ఫర్మానా పట్టుకవచ్చాము. మీరందఱూ బందిఖానాకు రావాల.

ధర్మా—అక్బ రిచ్చినాఁడా యీఫర్మానా ?

వీరా—(అపవారించి జయమల్లుతో) జయమల్! నీబల్లెమునకుఁ బని కలిగినది.

జయ—(అపవారించి) అందులకు సిద్ధమయియే యుంటిమి.

వీరా—ఫర్మానా యిటు తెండు. రండు. (మొహిద్దీనుఖాను, లోడీఖాను ముందునకు వచ్చి ఫర్మానా చూపుదురు. వీరాసింగు దానిని పుచ్చుకొని చింపివేయును. జయమల్లు గోరాసింగు లిరువురును మొహిద్దీను లోడీఖానుల నొక్కసారిగాఁ బొడిచి నిష్క్రమింతురు.)

మొహి | లోడీ | (హా! హా! యని చచ్చి పడిపోవుదురు.)

[ప్రవేశము:— మహామదుస్సేన్ ఖాన్, మానసింగు, ఖడ్గహస్తులై శీఘ్రగమనమున]

మహ—అరేరే! మోసం! మోసం! అరే అన్వరుద్దీన్! అరే గాసుబేగ్! అరే మహబత్! అరే గోరీ! అరే ఆగా! జల్దీ ఆవ్! జల్దీ ఆవ్!

[శీఘ్రముగఁ గొందఱు తురుష్కులు ప్రవేశింతురు.]

మహ—మీరు జల్దీ పోయి రాజపుత్రులను బట్టుకోండి.

(సైనికులు పరుగిడుదురు.)

మాన—మహామద్! ఏమిపనిచేసితివి? వీరికి రాజపుత్రయోధులు దొఱకుదురా? 500 అశ్వదళముతో ఠాకూరు సింగు రాయబారులను గలిసికొని కోటలోనికిఁ దీసికొని పోవుచుండెను.

మహా—(భయముతో) ప్రమాదం జర్గిందీ ప్రభూ ! మెమిం
చాలా కోర్తాన్.

మాన—క్షమింపవలెనా ? నలుగురు రాజపుత్రయోధులను
బట్టుకొనుటకై యిరువురు సైనికులను బంపితివా ?
నీవు పాచ్ఛాయెడ ద్రోహము సంకల్పించి రాజపుత్రు
లతో నేకీభవించితివా ? జాగ్రత్త.

[ప్రవేశము:—అక్బరు.]

అక్బ—రాజపుత్రులు పాఱిపోయిరా ? ఏమి మహామద్ !

మహా—(వడఁకుచు) వీరిని చంపీ గోడా దాటీ పారిపోయాన్
పాచ్ఛా ! మెమించాలా కోర్తాన్.

అక్బ—అట్లే క్షమించెదను. మానసింగ్ ! ఈ అహమద్
ఖానును నిరువది యైదుగురు సైనికులచేఁ గాల్పిం
పుము. తీసికొని పొమ్ము.

మాన—చిత్తమట్లే చేయుదును. (మహమ్మదు హుస్సేనును
పట్టుకొని తీసికొని పోవును.)

అక్బ—సేవకా ! గోడ దాఁటి పరువిడుచున్న మనవారిని
బాకా నూది రావింపుము.

సేవ—చిత్తమట్లే చేయుదును. (పోయి బాకాను తెచ్చి
యూదును. కొంత సేపటికి సైనికులు వత్తురు.)

అక్బ—సైనికులారా ! చూచితిరా యీమహాఘోరము ?—
యీదారుణహత్య—యీపిశాచకార్యము—మదించిన రా

జపుత్రులు నిష్కారణముగా మనసైనికుల నెట్లు చంపిరో చూచితిరా? ఈమహాద్రోహమునకు వీరికి సమాధానము చెప్పవలసిన బాధ్యత మనపైనున్నదా, లేదా?

సైనికులు—యుద్ధము! యుద్ధము!!

అక్బ—యుద్ధమునకు మనము తొందరపడరాదు. ఆక్రూరులైన రాజపుత్రుల నొకదారికి రప్పింపవలె నని రాయబార మంపితిమి. మనరాయబారులను వారు మిక్కిలి యవమానించిరి. మఱియును రాయబారుల మను నెపమున నిక్కడకు వచ్చి యీదారుణహత్యల నొనర్చి పాఱిపోయిరి. వీరిసంకల్పము నన్ను వధింపవలె ననియే. అందులకయియే వీరిరాయబారము. ఇప్పుడు వీరిని వధించుటయా లేక వెనుకకు దిరిగి వెడలిపోవుటయా? తెలుపుఁడు.

సైనికులు—యుద్ధము! యుద్ధము!!

అక్బ—మీరు యుద్ధమును గోరుకొనుచున్నారు. సరియే— రాజపుత్రయోధులు శక్తిసామర్థ్యములఁ దక్కువవారు కారు. వారు మిక్కిలి బలశాలురు. మహాపౌరుషవంతులు. వారితోఁబోరు పెద్దపులితో జెలగాటము. మీకుఁ బ్రస్తుతవీరావేశమునఁ దెలియకపోవచ్చును. పిదపఁ బశ్చాత్తాపపడెద రేమో! వారితో యుద్ధము

మిక్కిలి కష్టము. మీ రెల్లరును యుద్ధము చేయ నిశ్చయించుకొనిన మన మట్లు చేయుదము. లేకున్న మనము వెనుకకు తరలిపోవుదము. కాని మొగలాయీ రాజ్యక్షేమమును గోరి మీ రీయుద్ధమును సంకల్పించుకొంటిరేని యది చేయక తప్పదు. మీ రెల్లరును యుద్ధమును గోరెద రేని రేపటినుండియే మీ మీ యుద్ధనైపుణ్యములఁ జూపవలెను. సమరమునకు జంకవలదు. శాత్రవులకు వెన్నీయవలదు. రణమో మరణమో జరుగవలెఁ గాక !— శాత్రవభూమిని వదలి తిరిగివచ్చుట మాత్రము చెల్లదు. నిశితఖడ్గములతో— బల్లెములతో— విండ్లమ్ములతోఁ— దుపాకులతో— ఫిరంగులతో— రిపులఁ జించి, చెండాడి, హత మొనరించి, వధించి, ప్రేల్చివేయవలెఁ గాక !— దయాదాక్షిణ్యములకుఁ గరుణకుఁ బ్రేమకుఁ దావు లేదు. క్రోధమే—రౌద్రమే—భీభత్సమే మనము కోరుకొనునది—కోరుకొనఁ దగినది. ఇట్లు యుద్ధము చేయుదమా ?

సైని—యుద్ధము ! యుద్ధము ! !

అక్బ—అట్లైన సిద్ధపడుఁడు. చిత్తూరు భూత, ప్రేత, పిశాచముల కాలయము గావింపుఁడు. నరమాంసములతో, రక్తముతో, నెముకలతో, కండరములతో, గాలికాలయము గావింపు డీచిత్తూరుకోటను!—నిశ్చలమనోత్సా

హాము, నిర్మలదేశభక్తి, నిర్వక్రపరాక్రమము, నిస్తుల రాజభక్తిని గలిగి నిర్మానుష్యముగఁ జేయఁ డీచిస్తూ రుకోటను!— నిరంతరక్రోధకారణు లయిన యీరాజ పుత్రులను నిర్వీర్యులఁ జేసి, నిరుపమానసుందరుల మని విఱ్ఱవీగు నీరసపుత్రరమణులఁ జితులపై కెక్కించి దహ నపఱుపఁ డీచిస్తూరుకోటను !!

[తెరలోఁ దుపాకులధ్వని—హా ! యను నార్తరవము.]

చూచితిరా ? సైన్యాధికారి మాయాజ్ఞల నెఱవేర్పనందుల కెట్లు శిక్షింపఁబడినాడో ! ఈసైనికులలో నెవ్వరైన మాయాజ్ఞల మీఱిన నిట్టిశిక్షనే పొందుదురు; పోయి యుద్ధసన్నాహముఁలఁ గావింపుఁడు. జాగ్రత్త.

(నిష్క్రమింతురు.)

తెర పడును.

---

అవిఘ్నమస్తు.

# చిత్తోడుపతనము

## తృతీయాంకము.

### ౧వ రంగము.

ప్రదేశము:—చిత్తూరుకోటలోని బయలు.

[ ప్రవేశము:—పుట్టా; వీరాసింగు. ]

పుట్టా—మామగారూ ! మనవారెల్లరు మహోత్సాహవంతులై పెండ్లికిఁబోలె రణమునకై తరలి వచ్చుచున్నారు.

సంబర మొప్ప మ్లేచ్ఛరిపు సంహరణంబును జేయఁగోరి పీతాంబరము ల్ధరించి విదితంబగు నిశ్చలదేశభక్తి రూపంబు వహించునట్లు కనుపండువు చేసెడియోధులెల్ల యుద్ధంబున కేగుదెంచెడివిధంబును జూచినమోద మయ్యెడిన్.

[ తెరలో ]

దీన్ ! దీన్ ! భరతమాతకీ జయ్ !

## రణగీతము.

రాజపుత్రులారా! లెండు। రణమునకై తరలిరండు
తేజము నోజము నెల్లెడ। దీపింప యశము గొనుండు॥ రాజ॥
వీరభోజ్య మనుచుం గోరి। పోరి బడయుండు స్వారాజ్యము
పౌరుషమునం జచ్చిరేనిం। బడయంగలరు స్వారాజ్యము॥ రాజ॥
మాతృదాస్యముక్తికి స। న్మహిత దేశభక్తి కెన్ని
నెత్తురుబొట్లు రాల్చిన నవి। నిల్చును దివి నన్నియేండ్లు॥ రాజ॥

[అని పాడుచు ధర్మాసింగు, గోరాసింగు, జయమల్, సాలుంబ్రా, పలువురు యోధులు విల్లమ్ములు డాలు బల్లెములు ఖడ్గములు ధరించి ప్రవేశింతురు.]

పుట్టా—మామగారూ! పితాజీ! చిత్తూరు సంరక్షించుభారము మీచేతులపై నున్నది. శాత్రవసమూహములు తూర్పుగుట్టను దిగి కోటను జుట్టు ముట్టడించుచున్నవి. మనయోధులు పెక్కండ్రు సాయుధపాణులై కోటగోడలపై నిలిచి శత్రుమారణయంత్రములం బన్నుచున్నారు. కోటద్వారముల సంరక్షించుచు గజము లున్నవి. వలయునెడ శత్రులపై విజృంభించుటకును లేనియెడ గజముల సంరక్షించుటకును వేయియశ్వదళము ముందు నిర్మింపఁబడి యున్నది. కావున మీరెల్ల నీసారి రాజపుత్రస్థానగౌరవమును నిలబెట్టవలయు నని కోరు

చున్నాను. సాలుంబ్రాధీశ్వరా! మీరు రాతూర్పుద్వారము పై నుండి రణము గావింపుడు. ధర్మాజీ! మీరా పశ్చిమద్వారముకడ నుండి శత్రువుల నెదిరింపుడు! గోరాసింగ్! నీ వశ్వదళాధికారివై యుండి సమయము దొరకినప్పుడెల్లను మానసింగును బట్టి లోనికిఁ దీసికొని రమ్ము. నీవు పోయి రమ్ము.

వీరా—చిత్తము.

(ధర్మాసింగు, సాలుంబ్రా, గోరాసింగులు నిష్క్రమింతురు.)

నాగే—సర్కార్! మిగిలిన యోధు లందఱకు నేమి యాజ్ఞ?

పుట్టా—సంగావతులతో దేవగురుసింగును సాలుంబ్రాధిపతికి సాహాయ్యము చేయుమనుము. బైద్లా కోఠారి దేశాధిపతుల ధర్మాసింగునకుఁ దమ తమ సైన్యములతో సాహాయ్యము చేయుమనుము. బిజిలీపతి, జలాసింగును దక్షిణద్వారముకడఁ దమఫౌజుతోఁ గోటగోడలపై నుండి పోరవలసిన దని చెప్పుము. రావుఫత్‌దాదాసింగును, సోనిగుర్రావును ఉత్తరద్వారము పైఁ దమపదాతుల సాహాయ్యమునఁ బోరవలసిన దని చెప్పుము. రహతూరీశ్వరదాసును, కరంచంద్ ఖట్వాచాను అశ్వదళములపై నధికారము వహించి శత్రువుల నెదుర్కొను మనియు, గ్వాలియరుతారాపతిని సాదాసీదా

వాను గజాధికారులుగ నియమించి కోటద్వారములు సంరక్షింపవలసిన దనియుఁ జెప్పుము.

నాగే—చిత్తము. మీయాజ్ఞల నిర్వర్తింపఁ జేసెద.

(నిష్క్రమించును.)

[ప్రవేశము: మీరాబాయి, కర్ణావతీదేవి-యోధ వేషములతో]

మీరా— పుట్టా! మే మెచ్చటనుండి పోరవలయును? మా కాజ్ఞల నొసంగ లే దేమి?

పుట్టా—తల్లీ! మమ్ముల శాసించవలసినదానవు నీకా నే నాజ్ఞ నిచ్చుట? నీ కిష్టమువచ్చినచోట్ల నుండి శత్రువుల నిర్జింపుము.

కర్ణా—పుట్టాజీ! నా కేమి యాజ్ఞ?

పుట్టా—అమ్మా! మీ రెవ్వరు?

మీరా—వీరా? చిత్తూరుసంస్థానాధీశ్వరురాలైన రాణీకర్ణావతీదేవిగారు.

పుట్టా—(నమస్కారము చేయుచు) తల్లీ! తల్లీ! కర్ణావతీదేవి!! నీ కాజ్ఞ నే నీయవలెనా? సహస్రమాసజీవివి-చిత్తూరుసంస్థానాధీశ్వరివి-రాజపుత్రస్థానరమణీమణులలో వీరమాతవు-ఈహిందూదేశమునందలి ముప్పది మూఁడుకోట్లప్రజలు నీ కనుసన్నల మెలఁగవలసిన వారు-అఖిలభారతదేశమునకుఁ జక్రవర్తినివై పరిపాలన

సేయ సమర్థురాలవు—తల్లీ! నీకా—నీకా—నే నాజ్ఞ నొసం
గుట ? ఈ పుట్టా కంఠమునుండి ప్రాణవాయువు లెగిరి
పోయినపిదపఁ గత్తి పట్టుదువుగాని—యంతవనుక తల్లీ !
సింహాసన మునిష్ఠించి మా కందఱ కాజ్ఞల నొసంగి
మమ్ముఁ బ్రోత్సాహపఱుపుము. నీయాశీర్వచనబలముచే
మేమే శత్రులఁ దునుమాడుదుము. రాజపుత్రయోధు
లలో నొక్కఁడైన జీవించియున్నంతకాలము—అమ్మా !
రాజపుత్రరమణీమణులచేఁ బోరు చేయింపలేము.
అందు విశేషించి నీయట్టివృద్ధురాలిని కోటగోడపై
కెక్కించి పోరు చేయింపలేము. తల్లీ ! క్షమింపుము.
మీరు ఖడ్గపాణులై రణభూమికి రావలసిన సమయ
మేతేరలేదే ! మీరా మాతా ! నీ వీకర్ణావతీదేవిని
యంతఃపురమునకుఁ బంపివేయుము.

కర్ణ.—పుట్టాజీ ! నీ వింకను బాలుఁడవు. దేశవిప్లవసమయము
లందు ఒక్క పురుషులను యువకులను బోరవలసిన దని
బ్రహ్మ యాజ్ఞాపింపలేదు. స్త్రీలను పోరొనర్పరాదని
శాసింపను లేదు. కావున మన మెల్లరమును బోరవల
సినవారమే. నాయందలిభక్తిచే నీ వట్లనెదవు కాని,
మాయుదయుఁడే నాకడుపునకుఁ జిచ్చువెట్టి వెడలిపో
కుండ నుండిన నిట్లనునా ? నాదౌర్భాగ్య మిట్లుండ
వాఁడు ప్రాణములపై నాసచేఁ బలాయన మొనరించెఁ

గాని, ఇందఱు వివిధదేశాధిపతులు తమ తమ నివాస ములు విడిచి చిత్తూరు కాపాడ వచ్చి పోరుచున్నప్పుడు తా నొక్కఁడే జానెడుపొట్టకై గ్రుక్కెడుప్రాణములఁ జిక్కఁబట్టుకొని పాఱిపోయినాఁడే! నాయనా! సమ యమునకు నీవు వచ్చి నాకు కుమారుఁడు లేనిలోప మును దీర్చి చిత్తూరును గాపాడుభారమును వహించి శాత్రవులతోఁ బోర సిద్ధ మయితివి. ఈ చిత్తూరుసంరక్ష ణభారము నీవు వహించియే యుంటివి. కావున నే నీభూ మిపై నిఁక మనియుండవలసిన కారణము గాన్పించుట లేదు. ఒక వేళఁ గార్య మేమైన మించినయెడల నేను నిరర్థకముగఁ జితి నెక్కి జోహా రొనరింపవలెఁ గదా! అంతకంటె బ్రదికియుండిన నాల్గునిముసములును ఖడ్గ ధారినైన శాత్రవుల నిర్జించి నీకుఁ గొంతభారము దీర్పఁగలనేమో యని యిటు వచ్చియున్నాను. మీా యందఱవలె నేను విజృంభించి రణము గావింపలేకు న్నను గొంతదనుకఁ బోరి కొందఱశత్రువులనైన సంహరింపఁగల ననుధైర్యము పూర్ణముగ నున్న దోయి! నాకు రణభూమిని నిలుచుట కుత్సాహము గలదు కాని యింటఁ గూర్చుండుటకు మన స్సొప్పుట లేదు. కావున నే నంతిపురిలోఁ గూర్చుండ లేక యీాహ వభూమి కరుదెంచితినోయి!

పుట్టా—చిత్తము. మీరును మాతల్లి మీరాదేవియును గలిసి యేయుండి పోరొనర్పుఁడు.

కర్ణా—మంచిది—నాయనా ! ఇవే నాకడపటి యాశీర్వచనములు.

(స్త్రీలెల్లరు నిష్క్రమింతురు.)

పుట్టా—జయమల్లూ ! నీ వీవృద్ధలైన రాజపుత్రస్త్రీలను సంరక్షింపుచుండుము.

జయ—అట్లనే. (నిష్క్రమించును.)

పుట్టా—మామగారూ ! మీ రాయుధాగారమున నధికారమును బూని, యెవ్వరి కెప్పు డెయ్యది కావలెనో వానినెల్ల నొసంగుచు జాగరూకులరై యుండుఁడు. నేను రణమెచ్చట నొత్తిడిగ నున్న నచ్చటి కేగుచుఁ బోరుచుండెదను.

[తెరలోఁ దుపాకులధ్వని.]

అదిగో ! యుద్ధప్రారంభ మైనది. జాగ్రత్త.

(నిష్క్రమింతురు.)

తెర పడును.

---

## ౨వ రంగము.

ప్రదేశము:—చిత్తూరుకోట కెదురుగనున్న గుట్ట.

[ప్రవేశము:—అక్బరు, మానసింగు.]

అక్బ—మానసింగ్! ధర్మాసింగు చనిపోయినందుల కెంతయు సంతోషముగా నున్నది. తూర్పుద్వారము చెంతఁ బోరెట్లున్నది?

మాన—మనవారు కోటగోడలఁ జాలవఱకు నెగఁబ్రాఁకిరి. అచ్చట నధికారి సాలుంబ్రాయఁట. అతఁడు చండశాసనుఁడు. ఒక్కొక్క వ్రేటున పదిమందిని నఱకుచున్నాఁడు. వానివిజృంభణంబునకు సహింపలేక మనవారు వెనుకకుఁ దగ్గిరి. అది నే నెఱింగి మనవారి నుత్సాహపూరితులఁ జేసితిని. వెంటనే మనవారు కోటగోడల కెగఁబ్రాఁకి సాలుంబ్రాను జుట్టుముట్టిరి. మాసంగతి పుట్టా కెట్లు తెలిసినదో నే నెఱుఁగను గాని, యాతఁ డాకస్మికముగా వచ్చి ఖడ్గమును ఝళిపించుచు మన సిపాయీలపైఁ బడియె. అందుచే సంకులసమరము సంభవింపఁ బుట్టా మనవారిని డెబ్బదిమందిని బలిగొనినాడు. పుట్టా వచ్చుటఁ జూచి భయపడి గోడలం

దూరకంగాపోయి కందకములలోఁ బడి మరణించినవారు రెండువందలకుఁ బైగ నున్నారు.

అక్బ—ఆహా! పుట్టా మహాయోధుఁడు. పదునాలుగేండ్ల ప్రాయమువాఁడయ్యును పుట్టా యెంతబాగుగఁ బోరుచున్నాఁడో చూచితిరా?

[ప్రవేశము: సేవకుఁడు.]

సేవ—ప్రభూ! మన అన్వరుద్దీన్ ఖానుఁడు మడసినాడు.

మాన—ఎందుచేతను?

సేవ—స్త్రీలు పోరుచున్నయెడ కన్వరుద్దీనుఁడు పోయి గోడపై కెక్కుచుండఁగాఁ బదునాలుగేండ్ల బాలిక యొకర్తు ఓరి మూఢా! మా యూజ్ఞలఁ బాలింపవా యని యాతనిం దన్నె. అందుచే నాతఁడు గిరగిరఁ దిరుగుచు హా హా రావముల్ఁ జేయుచుఁ గందకముల కీవల నలువదిగజముల దూరమునఁ బడియె.

అక్బర్—సరియే పొమ్ము.

(సేవకుఁడు నిష్క్రమించును.)

అక్బ—ఆహా! రాజపుత్ర స్త్రీలబలము! వారు నిక్కముగా సబలలే కాని యబలలు కారు.

[సేవకుఁడు ప్రవేశించి]

సేవ—ప్రభూ! మన యూగాఖానుఁడు నెత్తురు గ్రక్కుకొనుచున్నాఁడు.

అక్బ—అది యేమి ?

సేవ—సాలుంబ్రాను వసించుటకై పోయిన యాతఁడు పుట్టా ను జూచి భయమొంది చచ్చినవానివలెఁ గోటగోడపైఁ బరుండి కొంతవడికి మెల్లన లేచి వెనుకనుండి పుట్టాతోఁ గలియఁబడఁబోయెను. అప్పుడాగా వెనుక నుండి ఎవరో యొక యోధుఁడు ముందుకు వచ్చి ఆగా మెడపై గ్రుద్దెనఁట. ఆ దెబ్బచే ఆగా కనులు తిరిగి పోయెను. ఆతఁడు కోటగోడపైనుండి క్రిందనున్న మన సైనికులపై రక్తమును గ్రక్కుకొనుచుఁ బడెను.

అక్బ—అయియుండవచ్చును. ఆగాను వైద్యాలయమునకుఁ గొనిపొండు.

(సేవకుఁడు నిష్క్రమించును.)

అక్బ—మానసింహా! మన యోధులెల్లరును మరణించుచుం డిరి. జయము కష్టముగా నుండునేమో? ఎందులకైన మంచిది. మనము ఢిల్లీనుండి రప్పించిన నలుగురుఖనకు లను కోటలోనికి సొరంగములఁ ద్రవ్వున ట్లాజ్ఞాపింపుము.

మాన—చిత్త మిప్పుడే పోయి చేయించెదను.

(నిష్క్రమించును.)

సేవ—(ప్రవేశించి) ప్రభూ! నిచ్చెనపై కెక్కుచున్న మన యోధులు పండ్రెండుగురునుగూడఁ బుట్టా విసరిన బల్లెముచే దూసివేయఁబడిరి.

అక్బ—ఆహా! ఫుట్టా ఎంతబాహుబలసంపన్నుఁడు! బ్రదికి యున్నవారిని వైద్యాలయమునకుఁ గొనిపొమ్ము.

సేవ—మనవారు కోటగోడపైఁ బ్రాణహస్తులై నిలిచిన ఫుట్టాను జూచినంతనే గతప్రాణులైరి.

అక్బ—ఆఁ! మనవారందఱును మరణించిరా? సరే, పొమ్ము.

(సేవకుఁడు నిష్క్రమించును)

మాన—(ప్రవేశించి) ప్రభూ! మీయాజ్ఞాప్రకారము చేసితిని. చితూరుప్రజలుకూడ యుద్ధము చేయుచున్నారఁట.

సేవ—(ప్రవేశించి) ప్రభూ! ప్రభూ! చితూరుకాఁపులు మన గాసుబేగును నాగలితో దున్ని వేసినారు. సెలవు.

(నిష్క్రమించును.)

అక్బ—అల్లా! అల్లా! ఏమిసంకటము వచ్చినదోయి మాన సింగ్!

మాన—రాజపుత్రులతో యుద్ధమనిన వప్పులాట కాదు గదా!

అక్బ—నేను యుద్ధమున నింతతీవ్రముగఁ బోరవలసియుండు ననుకొనలేదు.

సేవ—(ప్రవేశించి) ప్రభూ! మన మహాబత్ ఖానుఁడు స్త్రీ జనములచేఁ బైనుండి ద్రిమ్మరింపఁబడిన వేడినూనియ లోఁబడి వడియమైనాడు. నాకు సెల వొసంగుఁడు.

(నిష్క్రమించును.)

అక్బ—అబ్బబ్బ ! ఎందఱెందఱు నిష్కారణముగా వధింపఁబడు చున్నారో చూచితివా ?

మాన—రక్తప్రవాహములు పాఱినఁగాని రాజ్యసంపాదన మెట్లు ?

సేవ—(ప్రవేశించి) ప్రభూ ! ప్రభూ ! జయమల్లు మనగోరీని బట్టుకొని కోట రెండవప్రక్కకందకములోనికి గిరవాటు వైచెను. అతఁడానగరద్వారము తగిలి కందకములోఁ బడి మరణించెను.

(సేవకుఁడు నిష్క్రమించును.)

అక్బ—ఏమి ! గోరియేనా ? మానసింగూ ! ఈగోరీ మిగుల బలశాలి సుమా ! వానికెట్టిగతి పట్టెనో !

మాన—అవును. మనవారి బలములు మనకుఁ దెలియును గాని పైవారిబలములు మన కెట్లు తెలియును ?

సేవ—(ప్రవేశించి) ప్రభూ ! గోరాసింగు అయిదువందల యాశ్వికదళముతోఁ గోటవెలుపలకు వచ్చి యేలిన వారి దర్శనార్థమయి సంధిపతాకముల బట్టుకొని వచ్చుచున్నాఁడు. మనసిపాయిలు వానిని లోనికి రానిచ్చుట లేదు. వారు ఇప్పుడు చేయవలసిన పనినిగూర్చి వర్తమాన మంపినారు.

అక్బ—మానసింగ్ ! ఇదియొక యెత్తు. నీయభిప్రాయ మేమి ?

మాన—కాకున్న నిప్పుడు రాయబారములు కుదురుననియే వచ్చియుండునా గోరాసింగు ?

అక్బ—నిజమే. సేవకా ! గోరాసింగు నొక్కనినే లోనికిఁ బ్రవేశ పెట్టుము.

సేవ—అట్లొంటరిగ రాఁడఁట ప్రభూ !

అక్బ—అట్లనా ? మానసింగ్ ! నీవును అశ్వదళమును దీసికొని పోయి వాని నెదుర్పుము. (మానసింగు పోవును.)

అక్బ—సేవకా ! నీవు పోయి యశ్వయుద్ధమునం దెవరు గెలుచుచున్నారో చూచి రమ్ము.

సేవ—(నిష్క్రమించును.)

అక్బ—(తనలో) రాజపుత్రులు యోధులేగాక మాయావులునైయున్నారు. పోరులో నీసారి గోరాయే వధింపఁబడిన మొదలఁ జితోడు పతన మందఁతీఱును. మొగలాయీ పతాక మిచట నెగిరితీఱును.

సేవ—(ప్రవేశించి) ప్రభూ ! పోరు తీవ్రముగ జరుగుచున్నది. గోరా యొక పెద్దవలను దెచ్చి మానసింగును బట్టవలెనని ప్రయత్నించుచున్నాఁడు.

అక్బ—అయ్యో ! ఏమయినదో పోయి చూచి రమ్ము.

సేవ—(పోవును.)

అక్బ—(తనలో) మానసింగును బట్టిన వీరి కేమి ప్రయోజనము ? మనుజుని బట్టుటకంటె వధించుట తేలికగాదా?

మానసింగును బట్టుకొన బ్రయత్నించుటలో నేదియో రాజకీయ ముంచితి అవలె.

సేవ—(ప్రవేశించి) ప్రభూ ! మానసింగు వలలోఁ బడియుఁ బట్టవచ్చిన గోరాసింగును దన చిన్నతుపాకితోఁ జంపి తరువాత ఖడ్గముతో వలఁ జించుకొని వెలుపలకు వచ్చి రాజపుత్రుల యశ్వదళమును బీనుఁగు పెంట గావించెను.

(సేవకుఁడు పోవును.)

అక్బ—బలే, బలే, మానసింగ్ ! నీవే నిక్కమైన యోధుఁడవు.

సేవ—(ప్రవేశించి) ప్రభూ ! మానసింగు మన సైన్యమును దీసికొని రాజపుత్రస్త్రీలు పోరుచున్న యెడ కేగి, కోట గోడలకు నిచ్చెనల వేయించి మనవారిని బురికొల్పుచుఁ బైకెక్కించుచుండెను.

అక్బ—మానసింగే యెక్కుటలేదు కదా !

సేవ—మానసింగు ముందే యెక్కెను.

అక్బ—అయిన వానికిఁ బ్రమాదము సంభవించు నేమో ! మనవారిని జాగ్రత్తగ నుండు మనుము. నీవు పోయి యేమిజరిగినదియుఁ దెలిసికొని రమ్ము.

(సేవకుఁడు పోవును.)

అక్బరు—(తనలో) మానసింగు మహాసాహసవంతుఁడు. అత్యుత్సాహముతో నున్న యాతఁడు యుద్ధమునకు ముందుండక వెనుక నుండునా ?

సేవ—(త్వరితముగఁ బ్రవేశించి) ప్రభూ ! ప్రభూ ! ప్రమాదము ! ప్రమాదము !! మానసింగును జయమల్లు యెడమచేతితోఁ బట్టుకొని, కుడిచేతితో మనసైనికుల నెల్లఁ బరిమార్చినాడు. పిదప నీతని బందీకృతుని జేయ వలసినది యని కేక వేయుచు మానసింగును కోటలో నికి గిరవాటువైచెను.

అక్బ—(ఆత్రమున) అయ్యో ! అయ్యో ! అయ్యో !—ఇంక నేమున్నది ? ఇంక నేమున్నది ?—సైనికులారా ! లెండు! లెండు !!—రాజపుత్రులనెల్లర నఱకుఁడు !—చంపుడు !—కాల్చివేయుఁడు!—చిత్తూరుస్త్రీలకుఁ జెతు లంటింపుఁడు—సొరంగములలో మందు కూరుఁడు !—కోట నొక్కసారి ప్రేల్చివేయుఁడు !—చిత్తూరును భస్మము చేయుఁడు !—అయ్యో! అయ్యో !—ఇంక నేమున్న దింక నేమున్నది? మానసింగే బందీకృతుఁ డాయెనా ?—మానసింగే బందీకృతుఁ డాయెనా ?

(ఇటు నటుఁ బరుగెత్తుచుండును.)

తెర పడును.

---

# ౩వ రంగము.

[ప్రవేశము:—బందీకృతుండైన మూనసింగు.]

(కొందఱు రాజపుత్రులు కర్ణావతీదేవి శవమును గొని తెచ్చి క్రింద నుంచి వెడలిపోవుదురు.)

మూన—ఓ సైనికులారా! ఈకళేబర మెవ్వరిది? ఎందుల కిట్లు తెచ్చితిరి? దీనిఁ బంపినవా రెవ్వరు? మీవా రెవ్వరయిన నిటు వచ్చిరా?

సైని—ఓ రాజపుత్రయోధాగ్రేసరచక్రవర్తీ! నమస్కారములు. (నిష్క్రమింతురు.)

మూన—(నిర్విణ్ణుఁడగును.)

[ప్రవేశము:—మీరాబాయి.]

మీరా—మూనసింగ్! వచ్చితివా?

మూన—(తల వంచుకొని తనలో) వీ రెవ్వరు?

మీరా—ఏమి— మూనసింగ్! వచ్చితివా యని ప్రశ్నింప మాట్లాడ కూరకుంటి వేమి?

మూన—నేను రాలేదు. తీసికొని రాఁబడితిని.

మీరా—ఎవరివలన?

మూన—ఎవరివలననో తెలియదా? మీరాజపుత్రయోధుల వలన—

మీరా—మారాజపుత్ర యోధులా ? (నవ్వును.)

మాన—(కోపములో) కాదా ? మఱి యెవ్వరు నన్నిచటకుఁ దెచ్చినది?

మీరా—(నవ్వుచు) ఏల కోపపడెదవు ? నీవు "మారాజపుత్ర యోధు" లనుటచే నవ్వు వచ్చుచున్నది. నీవుమాత్రము రాజపుత్రయోధుఁడవు కావా ?

మాన—అయిన—

మీరా—అయిన మనరాజపుత్ర యోధులచే ననరాదా ?

మాన—అది యెట్లగును ?

మీరా—నీవు రాజపుత్రుఁడవు కావునను, నిన్నుఁ దెచ్చిన వారు రాజపుత్ర యోధు లగుటచేతను.

మాన—అగుఁగాక— వారు మారాజపుత్రులు కారు.

మీరా—ఓహో ! మీరాజపుత్రులా ? అనినఁ జిత్తూరురాజపుత్రులతోనే యుద్ధము చేయురాజపుత్రులు కారనియా ? పరరాజ్యసేవకై స్వరాజ్యవినాశనము కోరుకొను రాజపుత్రులు కారనియా ? మ్లేచ్ఛోద్యోగములకై లంచములఁ బోసియు, గౌరవాభిమానధనులైన యంగనల నొసఁగియు జీవింపఁజాలిన రాజపుత్రులు కారనియా ? హైందవరాజ్యలక్ష్మిని బహువిధమాయోపాయంబుల వంచించి గ్రహించినప్రభుత్వమునకు స్వదేశగౌరవాభిమానములఁ జంపుకొని సాహాయ్యము

చేయు రాజపుత్రులు కారనియా ?—ఏమి, ఏమి, నీయభి ప్రాయము ?

మాన—ఓయీ ! ఏల నీ విట్లు నిరర్థకముగా మాట్లాడెదవు ?

మీరా—నేను నిరర్థకముగ మాట్లాడుచుండ లేదు. నీ వెట్టిదారుణసంకల్పమునకుఁ బూనితివో నీకుఁ దెలియఁజెప్పుటకై మాట్లాడుచుంటిని. నీవును నీవారును జేసిన దారుణకృత్యముల నొక్కసారి నీకుఁ జూపించి, విప్పిచెప్పుటకై నీతోఁ బ్రసంగించుచుంటిని.

మాన—నేను నాధర్మమునే చేసితిని.

మీరా—ధర్మమే యొనరించితివా ?

మాన—అవును.

మీరా—నీ పితనిని వధించుట ధర్మమే యందువా ?

(శవముం జూపును.)

మాన—రణరంగమున ఖడ్గపాణియై నిల్చిన ప్రతియోధుఁడును వధార్హుఁడే కాఁడా ?

మీరా—అదియే నీధర్మమా ? ఈతఁ డెవ్వరో నీ వెఱుంగుదువా ?

మాన—నేను తెలిసికొనవలసిన యవసరము లేదు. అతఁ డొక యోధుఁడు. రణభూమిని శాత్రవులఁ జంప ఖడ్గహస్తుఁడై నిలువఁబడిన యొకరాజపుత్రయోధుఁడు. అంత మాత్రము చాలును. ఖడ్గమున కడ్డువచ్చిన ప్రతియో

ధునికులగోత్రనామములు కనుఁగొని వక్కాణింప నక్కఱ లేదు. అది యాహవభూమి గాని వివాహవేదిక కాదు.

మీరా—అట్లు గాక— యాస్థల మాహవభూమి యగుటచేతను, నీవు యోధానయోధుఁడ వని పేరు పెట్టుకొనిన వీర పురుషావతారమ వగుటచేతను నీ కీయోధునిఁ గూర్చి చెప్పవలసివచ్చినది ; కావునఁ గొంచెము శాంతము వహింపుము.

మాన—ఏమి నేను వీరపురుషావతారమునా? అయిన మీరు వీరస్త్రీయవతారమూర్తులా యేమి ?

మీరా—ఆమాటకే వచ్చెదను. (శవమునకుండిన గడ్డము, మీసము, శిరస్త్రాణముఁ దీసి) మానసింగ్ ! వీరెవరో చెప్పుకొనఁగలవా ? (శవమును జూపును )

మాన—(తేరిపాఱఁజూచి ఆశ్చర్యముగా) ఎ-వ-రు? యోధుఁడు గాఁడు—యోధురాలు. అందునను వృద్ధాంగనకాఁబోలు నేమి ? ఈమూర్తి యెవ్వరు ?

మీరా—వీరా ? స్వరాజ్యసంరక్షణార్థము స్వీయరక్తధారల మాతృభూమి కభిషేకించి వీరస్వర్గమును జూఱఁ గొనిన యీయామె చిత్తూరుసంస్థానాధీశ్వరి యైన రాణీ కర్ణావతీ దేవి.

మాన—ఆఁ! ఈమె రాణీకర్ణావతీ దేవియా? (నిర్విణ్ణుఁడగును.)

మీరా — కాదా ! కాదా ?—ఏతల్లి చిత్తూరుకోటలో వసించు చుండుటచే దేశమున కఖండైశ్వర్యము కలుగుచున్నదో, ఏకళ్యాణి యీరాజపుత్రస్థానమందు జీవించియుండుటచే దేశమం దధికోత్సాహవంతులైన యోధులు నిలుచుటకు నీడయుండెడినో, ఏమహాసాధ్వి భారతదేశమున నిల్చియుండుటచే నేఁటివఱకు నీదేశమందు స్వేచ్ఛావాయువులు వీచుచున్నవో—అట్టి సద్గుణాఖని—అట్టి పరమపావనమూర్తి—అట్టి రాణీకర్ణావతీదేవి నేడు నీచే నిర్దాక్షిణ్యముగా నిహతురాలైనది చూచితివా ? పరరాజు మెప్పునకై పడఁతిని వధించితివి. మొగలాయీసామ్రాజ్యము నుద్ధరించుటకై భారతీయప్రభువుల హతమొనరించుచుంటివి. అక్బరుచక్రవర్తి కేకచ్ఛత్రాధిపత్యము గల్గుటకై నాటిస్వతంత్రరాజపుత్రుల రక్తాభిషేకము చేయించుచుంటివి. ఇది యెంతటి ద్రోహకార్యమో యెఱుంగుదువా ? తరతరములవారు నిన్నెంత దూరుదురో తెలిసికొంటివా ? భారతదేశమునకు బానిసత్వమును స్థాపించినవాఁడ వని నిన్నుఁ జరిత్రకారులు వ్రాసి నీజీవితమున కెంతకళంక మాపాదింతురో తెలిసికొంటివా ? భారతీయులే శత్రుపక్షమునఁ జేరి స్వదేశ ప్రభువులఁ జంపించి పరరాజ్యపాలనము స్థాపింపఁజేసినవారని ఖండాంతరములందున్న జనులుకూడ నిన్ను నిందింతు

రని గ్రహించుకొంటివా ? మొగలాయీప్రభువులు శాశ్వతముగ నీదేశములో విజృంభించి యాసేతుశీతాచలము తమరాజ్యమును స్థాపించుకొనినపిదప హిందూదేశజులైన భారతీయులకు ఈదేశమున నిలువ నీడయుఁ గట్ట గుడ్డయు నుండు నని తలంతువా ? పోనిమ్ము—మామాట కేమి ? నిన్నుమాత్ర మీయక్బరు సర్వకాలములందునను బూజించు ననుకొంటివా ? స్వదేశద్రోహి పరరాజ్యద్రోహిమాత్రము కాఁజాలఁడా యని నిన్ను హతమార్చి నీరాజ్యమునుమాత్రము గలుపుకొనఁడని యెన్నుకొనుచుంటివా ? ఈయక్బరుతాతయైన బేబరు తనకు రాజ్యసంపాదనమునకై రణములలో సాహాయ్యము చేసినవానినే వధించె నను మొగలాయీచరిత్రమును మఱచితివా ? అట్టివానిమనుమనికి నీవు చేయు సాహాయ్యము స్వప్రాణవిఘాతుక కార్యమని తలంపవా ? నీసోదరిని ఒసఁగినంతమాత్రమున అక్బరు నిన్ను సర్వదా నెత్తిపైఁ బెట్టుకొను ననియే తలంచితివా ?

మాన—ఓ యోధుఁడా ! నీవు కొంత సత్యమునే వచించితివి కాని— నీ వనుకొనినట్లు అక్బరుచక్రవర్తిమాత్రము ద్రోహి కాఁడు. అతనికి మహమ్మదీయులయెడ నెక్కుడభిమాన ముండిన నుండవచ్చును. దాని కేమి ?

మీరా:—నాయనా ! అట్లనుకొనకుము. స్త్రీయమాతోద్ధరణాని మిత్తమై బద్ధకంకణుఁడైన యక్బరు హైందవరక్తము శరీరమునఁ బ్రవహించుచున్న నిన్ను సర్వదా గౌరవించుచనని మాత్రము తలంపకుము. నీసోదరిని నీవు మొగలాయీచక్రవర్తికిచ్చినను సరే— మొగలాయీచక్రవర్తి చెలియలిని నీవు వివాహము చేసికొనినను సరే— నీవు భారతీయుఁడవు కాకపోవు. నీమతము మాఱినను నీపవిత్రరక్తము మాఱనేఱదు, నీయాచారములు మాఱినను నీభారతదేశప్రేమ మాఱనేఱదు, నీబహిర్వేషములు మాఱినను నీపరమపవిత్రభారతదేశోద్ధరణోద్దేశములు మాఱనేఱవు—అట్టిమాతృదేశభక్తి గల నీవు—చూచితివా యీతల్లిని—నీకుఁ గలిగిన మాతృదేశభక్తివంటి భక్తి గలిగిన యీతల్లిని—చూచితివా? ఈపె వెన్నుపై నీక్రూరనిశితఖడ్గముచే—నిర్దాక్షిణ్యముగా నెట్లు పొడిచితివో? తనకొడుకు పాఱిపోవుటచేఁ గుందియుండియు రాజపుత్రరమణీమణులకీర్తి నిలువఁబెట్ట వచ్చిన యీతల్లికి యీప్రక్కలోనిగాయమును చూచితివా? పవిత్రతమమైన భారతీయరక్తము భారతవర్షముపై నెట్లు ప్రవహింపఁజేయుచున్నదో నీరాజపుత్ర సోదరిని కనుఁగొంటివా? నాయనా! మానసింగూ! ఈకర్ణావతీదేవి యెంతనిర్దాక్షిణ్యచిత్తముతో వనింప:

బడినదో జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనుము. ఈదేవి యింతఘోరమరణమునకుఁ బాల్పడు నుంటినను విచారసూచకచిహ్నములైన లేకుండ మనదేశదాస్యవిమోచనార్థము తనరక్తధారలఁ గురియించుచున్నా ననుసంతోష మీమెముఖమునుండి యెట్లు ప్రతిబింబితమైనదో చూచితివా? నిజదేశసేవ చేసిన యీతల్లికంటెను ధన్యాత్ములు గలరా!

మాన—నిజమే—నిజమే— నేను మహాదారుణకృత్య మొనర్చితిని. నాహృదయము నాలోఁ గృంగిపోవుచున్నది. పాపాత్ముఁడను. ఈఘోరమును నా యీ పాపిష్ఠిచేతులతోఁ జేసియు నింకను జీవించి గలిగియుంటిని. నన్ను మన్నింపుము. నేనే దురంతకృత్య మొనర్చితిని. ఈసాధ్వి నిజముగ ధన్యురాలు.

మీరా—భారతీయులకు జయ మగుఁగాక! యనునాశీర్వాదములే కడపటిమాటలుగఁ బరమపదించిన యీరాణీ కర్ణావతీదేవి నిక్కముగ ధన్యురాలు. యోధుఁడను భ్రమచే నీవు ప్రమాదమున వధియించితివి గాని, యీమె కర్ణావతీదేవి యని నీవు తెలిసికొనినఁ జంపి యుండవు. రాజపుత్రుఁడవైన నీకు ఈరాజపుత్రాంగన యెట్లు విరోధురాలగును? ఆతల్లికి వీరస్వర్గము పొందునదృష్ట ముండఁగాఁ దప్పింప నెవ్వరిశక్య మగును?

భగవదధీనము లైనజననమరణములకు మనము నరుల నుత్తరవాదులగాఁ జేయరాదు. కావున నీదోషము నీయది యనరాదు. శతవృక్షమై పుత్రునిం బోసిన యీమె నీచేతిమీఁదుగ-సాటిసోదరరాజపుత్రుఁడవైన నీచేతిమీఁదుగఁ-బరమపదించుట యీదేవికి అర్హమైనదే. నీచేతిలో నామె పరమపదించుటచే నామె కుత్తమలోకము లొసంగినవాఁడవు నీవే. ఈదేవి కానందము నొసఁగినవాఁడవు నీ వౌట నామెకు నందనుఁడవే.

మాన——కాను-కాను-నే నామెకుఁ దనయుఁడను గాను-కలుషాత్ముఁడను- ద్రోహిని- మాతృద్రోహమునే చేసిన మహాదురితాత్ముఁడను-నే నాతల్లి పే రుచ్చరించుటకైన ననర్హుఁడను— నన్ను వదలుము.

మీరా——నాయనా! నీవు నీచిత్తూరును నీ చేతులతో నాశనము చేసికొనెదవా? నీకు నీదేశమును గాపాడుకొను బాధ్యతమే యుండవలదా? రమ్ము. మాతోడఁ గలిసి యరులతోఁ బోరెదవుగాని— రమ్ము. ఈచిత్తూరురాజ్యములో నీయర్ధభాగమును గ్రహించికొందువుగాని రమ్ము. రాజపుత్రధర్మమును బాటించి, స్వదేశోద్ధరణమునిమిత్తమై బద్ధకంకణుఁడవు గమ్ము. భారతీయుల బానిసలఁ జేయకుము. ప్రపంచమునంతటిలోను బరమపవిత్రవంతమై కర్మభూమి యైన నీభారతదేశము నీసాహాయ్యమునకై

యాసించుచున్నవ్వాఁడు నీకరముల వెనుకకు లాఁగికొనను. నీదేశస్వాతంత్ర్యమునకై నీవు సాహాయ్యమును జేయుము. లెమ్ము. ఇదిగో- ఖడ్గము. నీకు మేలోనగూ డుదు. మామాట లాలింపుము. నాతోడ రమ్ము.

మాన—హా! యోధాగ్రేసరా! నీకు నమస్కారము. నన్నిం చుక వదలుము. నే నెచ్చటనుంటినో నాకుఁ దెలియుట లేదు. నన్నేల యింకను జీవింపఁజేసెదవు? కైకొనుము నీకరవాలమును. వధింపుము నన్ను ఖండఖండములుగ. నిలువఁబెట్టుము రాజపుత్రులకీర్తి.

మీరా—నాయనా! మాకు సాహాయ్యము చేయుము. నీక ట్లను విప్పింతును.

మాన—అయ్యో! నేఁటికి స్వామిద్రోహిని గాఁగలనా?

మీరా—కాని—దేశద్రోహివి కాఁగలవా?

మాన—అందులకే యీనిర్భాగ్యుని వధింపు మని వేఁడుకొ నుచున్నాను.

మీరా—నే నంగీకరింపను. నారాజపుత్రసోదరుని నేను వధిం చుట కంగీకరింపను.

మాన—పోనిమ్ము. స్వామిద్రోహినై యక్బరుతో యుద్ధము చేయను. దేశద్రోహినై రాజపుత్రులతో యుద్ధము చేయలేను. ఇదిగో- నాకర్ణావతీతల్లిపాదముల నంటి

ప్రమాణము చేయుచున్నాను. నే నీకఁ గత్తి పట్టుట సరిగదా! (అని శవముకడ మోకరించి పాదము లంటును.)

మీరా—నీవాక్యములను బ్రమాణముగాఁ దీసికొని నిన్నిపుడు బంధవిముక్తుని జేయుచున్నాను. కాని నీ వెచ్చటికీ గెదవు. (కట్లు విప్పును.)

మాన—(మీరాకాళ్లపైఁబడి) యోధాగ్రేసరా! నాకు మహోపదేశము జేసిన నీ వెవరవో చెప్పినఁగాని యిచ్చటినుండి లేవను.

మీరా—నాయనా! లెమ్ము. నేను చాందావంశస్థుఁడైన ఫుట్టాసింహుని తల్లిని.

మాన—హా! మీరామాతా! నీయద్భుత సాహసాదికముల నిదివఱకు వినియుంటినే కాని నిన్ను సందర్శించుపుణ్యమును నేఁటివఱకుఁ గట్టుకొనలేదు. ఆహా! నేఁడు నిక్కముగ నాకు సుదినము. నీ కివే పదివేల నమస్కారములు. ఈతుచ్ఛుఁడు నీకుఁ దిరిగి రణరంగమునఁ గనుపింపఁడు. నా కనుజ్ఞ నొసఁగుము.

మీరా—నీప్రతిజ్ఞను మఱవవలదు సుమా!

మాన—మీరామాతా! నాప్రతిజ్ఞను నీసందర్శనమును మఱతునా? శాత్రవుని నిశితబాణములకంటెఁ దీక్ష్ణ

తరము లైనవాక్యముల నన్ను వధించివైచితివి. శరీర
మునకుఁ దగిలినగాయములఁ గుదుర్చ మందు గలదు
కాని- హృదయకోశమును దూసిపోనేసిన ఘాతమునకు
మందు గలదా ? తల్లీ! నాకు సెల వొసంగుము.

**మీరా** — మంచిది పోయి రమ్ము. మఱవకుము.

(ఇరువురును చెఱియొక ప్రక్కకుఁ బోవుదురు.)

తెర పడును.

---

# 4వ రంగము.

(నేలఁబడియున్న మీరాబాయిచెంత రాణాబాయి కూర్చుండి యుపచారములఁ జేయుచుండును.)

[ప్రవేశము:—జయమల్లు.]

జయ—మీరామాతా! క్షత్రియాంగన కర్హమైనకృత్య మొనర్చి న్యాయసమ్మతమైన ఫలమును బొందితివి కాదా?

మీరా—బాబా! నిజమే. నామరణమునకు మీ రెవ్వరును సంతాప మొందవలసినయగత్యము లేదు. నేను నావిధ్యుక్తధర్మ మొనర్చి యపేక్షించినఫలమునే పొందితిని. ఇది నాకు మిక్కిలి యానందదాయకసమయము. నాయనా! పుట్టాకు వర్తమానము చేయించితివా?

జయ—ఆఁ! చేయించితిని. ఆతఁ డింతలోనే వచ్చును. తిరిగి వర్తమాన మంపుదునా?

మీరా—వలదు- వలదు. మొదటివర్తమాన మంపినందులకే విచారించుచుంటిని. నీవర్తమాన మాలించి యాతఁడు రణమును మాని నన్నుఁ జూడవచ్చెనా- శాత్రవుల విజృంభణ మాయెడ నెక్కుడుగ నుండవచ్చును. అట్టితఱి మనవారు వెన్నిచ్చినచోఁ జిత్తూరురాజ్యలక్ష్మి

పరాధీనవైపోవుఁ గదా ? ఇంతకును నేను పుట్టాతోఁ జెప్పవలసినవిషయము లేమియు లేవు. చిత్తూరుసంరక్షణవిషయము నేను వానికి తిరిగి చెప్పవలసిన యవసరముండదు.

జయ—నిజమే. (ముందునకుఁ జూచి) వాఁడుగో ! పుట్టా వచ్చుచున్నాఁడు.

[ప్రవేశము: పుట్టా తొందరగ.]

పుట్టా—(అధికదుఃఖముతో) అమ్మా ! అమ్మా ! - (చతికిలఁబడును.)

మీరా—పుట్టా ! లెమ్ము. నీ కీవిచారమునకుఁ గారణ మేమి ? యుద్ధ మెట్లున్నది ?

పుట్టా—అమ్మా ! శత్రువిజృంభణముచే నీవు క్షతగాత్రి వైతివని—

మీరా—అవును. అయిన విచారింపవలసిన దేనా ?

పుట్టా—అమ్మా ! ఇది విచారింపవలసిన సమయమే కాదా ?

మీరా—కాదు. ముమ్మాటికి నిది విచారింపవలసిన సమయము కాదు.

పుట్టా—అమ్మా ! హృదయకోశములోనుండి పొంగి పొరలి వచ్చుచున్న నావిచారమున కోరాట యెట్లు కలుగును తల్లీ ?

మీరా — విచారము స్త్రీలక్షణము. ధైర్యము, కార్యదీక్ష పురుషలక్షణములు.

పుట్టా — లాతివిషయములలో నట్లే యనుకొనవచ్చును గాని—తల్లీ! చల్లారని నాహృదయావేదనము నే నెట్లు సహించుకొని బ్రదికియుండఁగలను? నీయట్టి వృద్ధురాలిని నిర్దయాత్ముల ఖడ్గప్రహార మెంత నొవ్వఁజేసినదో కదా! హా! తల్లీ! నీకుఁ దగిలినఖడ్గప్రహారము నాకుఁ దగిలినను ఇంతగా విచారించియుండను.

మీరా — పుట్టా! ఏమిది? నీవు స్త్రీతుల్యుఁడ వనుమాట సార్థకము చేసికొనుచున్నావా?

పుట్టా — తల్లీ! ఇంకను నీమాటలచే నన్ను దూసిపోనేసెదవా! కానిమ్ము. తల్లీ! నీ కీదక్షిణభుజముపైఁ దగిలినగాయము ఎంతగా నొచ్చుచున్నదో కదా! హా! హా!! నీపవిత్రస్వాతంత్ర్యరక్తము చిత్తూరుక్కోటగోడలపై నభిషేకించుచుంటివా? నీయట్టి యుత్తమాంగనల నిర్మలరక్తముసహిత మీభరతమాత వాంఛించుచున్నదా? కటకటా!

మీరా — పుట్టా! నిరర్థకముగ నాకై విచారింపక పోయి శాత్రవుల నెదుర్కొనుము; పొమ్ము.

పుట్టా — తల్లీ! నీయట్టి వీరమాతను గోల్పోయినపిదపఁ గూడ

నింకను యుద్ధమేనా ? ఇంకను విజయమేనా ? వలదు ; వలదు. నన్నుఁగూడ నీతోఁ దీసికొనిపొమ్ము.

మీరా—ఏమి, ఏమి ? పుట్టా ! ఇటు చూడుము. నీ కేమైన మతిచాంచల్యము గలిగెనా ? నీమగతనము మండిపో యినదా? నీమేవాడ శౌర్యాగ్ని చల్లఁబడి నశించిపో యినదా? బప్పారావులకులములోఁ బుట్టియు రణమే వలదందువా ?

పుట్టా—అమ్మా ! అమ్మా ! నీవు వీరశయన మలంకరించినప్పు డుగూడ నా కేటిరణము ? నీబాహువులలోనుండి నన్నొ క్కసారిపైన— తల్లీ- తల్లీ- నా యేకలింగేశ్వరస్వామిని తలంచుకొననీయవా ? ఈ నా జన్మాంతమువఱకును నిన్నుఁ దిరిగి దర్శింపలేని యీనిర్భాగ్యునికి నిన్ను— సజీవినివైయున్న నిన్ను—యుద్ధభూమిం బడి ప్రాణోత్క్ర మణ సమయమునకై నిరీక్షించియున్న నిన్నుఁ— దల్లీ— యొంటరిగ— నిర్దాక్షిణ్యముగ— రణభూమిని విడిచి— యుద్ధమునకుఁ గడంగఁగలనా ? నన్ను క్షమింపుము.

మీరా—నీ విప్పు డేడ్చి నాకు గాయములు తగులకుండఁ జేయఁగలవా ? పొమ్ము.

పుట్టా—అమ్మా ! నిన్ను వీడి పోవఁగలనా ? లోకాంతరము నందుఁదప్ప యీలోపున నీదివ్యముఖదర్శనము నాజీవిత

కాలములో లభింపనిసమయములో నున్నప్పుడుకూడఁ—
తల్లీ ! తల్లీ ! !—నన్ను నిర్దయాత్మునివోలె వీడి పోవల
సిన దని యాజ్ఞాపించుట మానవా ? హా ! పాపిష్ఠిదై
వమా ! నన్నేల యింకను జీవింపఁజేసితివి ? హా !
తల్లీ ! నే పోవుటకుఁ గాల్లాడవే తల్లీ !—

(విచారించును.)

మీరా— పుట్టా ! ఈయేమ్మనకేనా యింతదూరము వచ్చి
తివి ? ఈఘనకార్య మచ్చటనే చేయలేకపోతివా ?
ఈ నీ లోకోపకారకార్యమును జూచి దేవతలు పుష్ప
వృష్టి గురియించియుందురే ! చిత్తూరుకోటగోడలపై
నిదివఱకు హతులైన స్వదేశాభిమానులు మేలు మే
లని నతు లొనర్చియుందురే ! భారతదేశమునకుఁ బర
మకళ్యాణకార్య మొనర్చితి వని చతుర్దశలోకములవారు
నిన్ను బ్రహ్మరథము పట్టియుందురే ! చాలు పొమ్ము.
నాగాయములఁ జూచి శత్రువుల క్షతగాత్రులఁ జేయుదు
నని శపథము బట్టుదు వనుకొంటిని గాని యింతఘన
కార్య మొనర్చెద వనుకొనలేదు ;—నామరణమును
జూచి శాత్రవుల మరణింపఁజేయుదు నని శపథము
బట్టుదు వనుకొంటిని గాని యింతవిశ్వకల్యాణకృత్య
మొనరించెద వనుకొనలేదు;— ఈచిత్తూరు సంరక్షించు
యోధులు నశించి పోవుటఁజూచి ద్విగుణీకృతోత్సాహ

వంతుఁడవై యీచిత్తూరు సంరక్షణభారమును నీభుజ స్కంధముపై వహించెద వనుకొంటిని గాని యింత సర్వజగదానందకరకార్య మొనరించెద వనుకొనలేదు.

పుట్టా—అమ్మా! నీవాక్యఘాతముల చేతను, నీవియోగసంతాపాతిశయముచేతను నాహృదయము వ్రక్కలై పోవుచున్నది. న న్నొక్కసారి నీపాదములపైఁ బడి శోకింపనీయవా?— శోకింపనీయవా?

మీరా—పొమ్ము. పొమ్ము. నీవు నాకై శోకింపనక్కఱలేదు. శోకించుట కేమైయున్న నిన్ను వర్తమానించియే యుండను. తెలిసినదా? నీవు నీయశ్రుజలధారలతో నాకుఁ దర్పణముల విడువనక్కఱలేదు. నీకుఁ జేతనైన మన శాత్రవరుధిరధారలతోఁ దర్పణముల విడిచి, మమ్ము సంతోషపఱపుము. అంతియకాని— యూరక శోకించిన నేమిప్రయోజనము! నీ తేజఃపుంజములైన యరుణ నేత్రముల విప్పి, దుర్నిరీక్ష్యతేజోవిరాజమానుఁడవై శాత్రవగర్భనిర్భేదముగ సంచరించి మాకు మేలొనఁ గూర్చెద వనుకొంటిమి గాని, ఖిన్నహృదయుఁడవై సంకుచితాత్ముఁడవై కనుల మూసికొని విచారించి మాకుఁ గూడ విషాదమును దెచ్చిపెట్టెద వనుకొనలేదు. పొమ్ము. పొమ్ము. బుద్ధిమంతుఁడవై యుద్ధముచేయుము. పిఱికిపందవలె విచారింపకుము.

పుట్లా—అమ్మా! నన్నేల దహించివై చెదవే ! నీ వేమైన ననిన నేనంగీకరింతును గాని పిఱికివంద నని నన్ను దూఱకుము. పిఱికితనమనునది చిత్తూరుగడ్డలో—విశేషించి ఖేల్వావంశములో లేనిపిఱికితనము నాకేల యాపాదింతువే తల్లీ ! నేను కానికృత్య మొనర్చితి నని నీవు తలఁచినచో నీయిష్టమువచ్చిన శిక్షకు నన్ను గుఱిచేయుము—తల్లీ ! కాని— కాని— పిఱికి నని నన్ను దూఱకుము. నే మరణమునకు వెఱచి యిట్లు రాలేదు. భారత దేశమున నీయట్టి వీరమాత నిజ దేశ సేవారాధన ఫలితముగా నిర్దయాత్ములచే వధింపఁబడినందులకై నేల విచారించుచుంటిని. నీయట్టి పౌరుష శాలినికే యీవిశాలభారతదేశమున నిలువ నీడ లేనిచోఁ గడము కాంతలకు గతి కలదా ?—తల్లీ !—ఇది నాదేశ మని చెప్పుకొనుటచేతనే గదా నీ కీముప్పు సంభవించినది ! నీయట్టివీరాంగనయే యిట్టిఫలితమును బొందవలసివచ్చి నప్పుడు, యభిమానఘనులై, దేశారాధకురాండ్రైన మగువలు మనియుండుట కీభారతభూమిలోఁ దావు కలదా ?

మీరా—భవిష్యత్తునుగూర్చి విచారించుట ప్రాజ్ఞలక్షణము కాదు. మఱియు, నీ విప్పుడు విచారింపవలసిన యవసరము లేదు. ఏల యందువా ? దేశాభిమానిని యైనరాజ

పుత్రాంగనకు యుద్ధకారణమున లభ్యమైన స్వర్గద్వార
ప్రవేశసమయము పరమపావనమైన సమయము. నే
నిట్టిసమయమున కెన్నియో సంవత్సరములనుండి యెదు
రు చూచుచుండగా నా కీనాటి కేది లభ్యమైనది.
అందుచే నా కిది సంతోషసమయము కాని, విచారింప
వలసిన సమయము కాదు. నీకును అంతే. తెలిసినదా ?

పుట్టా—ఇట్టిసమయమున కెన్నియో సంవత్సరములనుండి యె
దురు చూచుట యేమి తల్లీ !

మీరా—పుట్టా ! వినుము. ఈచిత్తూరు రెండవముట్టడిసమ
యమున నీకోటగోడలపైననే నీతండ్రి మొగలాయిపతు
లతోఁ బోరి మరణించిరి. నేనప్పుడు వారిమృతకళేబర
ముతో సహగమనము చేయవలసినదే కాని, నీ నప్ప
టికిఁ చంటిబిడ్డఁడ వగుటచే నిన్నుఁ బెంచవలసినభా
రము నాపై నుండినది. అందువలన నేనప్పుడు సహగ
మనము చేయు మానితిని. కాని నామగనిమృతకళేబర
ముతో నప్పుడు నిరర్థకముగ నాదేహ మగ్ని కాహు
తి చేయుటకంటె నాభర్త చేయఁబూనినకార్యము—నేను
నీసాహాయ్యమున ద్విగుణీకృతోత్సాహముతోఁ జేసితిని.
ఈ మొగలాయీలతో యుద్ధము చేయుచు నానాథుఁడు
పోయిన యీచిత్తూరుకోటగోడలపైననే నానాథుని
గతిని నేఁటికిఁ బొందఁగలిగితిని గదా యని గర్వించు

చున్నాను. ఈతరుణముకొఱకే నే నెన్నియో సంవత్స
రములనుండి కాచుకొనియున్నాను. నా కీనాఁటి కీరూ
పమున నది సంభవించినది. అందుచే నా కిది సంతో
షసమయము గాని విచారింపవలసిన సమయము కాదు.
నీవును రణోత్సాహమును వీడక కడవఱకుఁ బో
రుము. ఎన్నఁడు శత్రువారినిమాత్రము వడకుము.
ఇదిగో! ఈవీరుని జూడుము. (రాణాబాయిని జూపి)
వీనిని నీప్రాణముపోలెఁ గాపాడుకొనుము. ఈతఁడు నీ
కత్యంతసమీపబంధువు. ఈతని నామధేయాదులు
కనుఁగొన నీ కవసరము లేదు. నీ వీయోధునిసాహాయ్య
మున నీశత్రుల జయింపుము. నాయనా! కడమాటగ
నొకమాట చెప్పెద: శ్రద్ధమెయి నాలింపుము. నాయ
నా! మాతృదేశమునంటిది మఱొండు లేదు. ఆమాతృ
దేశారాధన కేఁ జేయునర్పణము శ్రీపరమేశ్వరప్రీ
త్యర్థ మని భావింపవలెను. ధనమానప్రాణములు ధార
వోసి నిజదేశసేవారాధన చేయువాఁడే నిక్కమైన దేశ
జుఁడు. నాపై నెంత ప్రేమ, భక్తి, కలిగియున్నావో
నంతప్రేమయు, నంతభక్తియుఁ గూడ నీదేశముపైఁ
గలిగియుండుము.

‘జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ’

యను మహావాక్యచకమును మఱచిపోవక రణమునకై తరలిపొమ్మా.

పుట్టా—అమ్మా! నీకివే నాసాష్టాంగనమస్కారములు. నీయమూల్యోపదేశములను, నీయాజ్ఞను, నేనాజన్మాంతము శిరసావహింతును.

[ప్రవేశము: ఒక యోధుఁడు.]

యోధు—ప్రభూ! మహమ్మదీయులధాటికుఁ దాళలేక రాజపుత్రయోధులు పాఱిపోవుచున్నారు.

పుట్టా—అట్లనా! అయిన నే నిదే—వచ్చుచున్నాను.

మీరా—పుట్టా! పోయి రమ్మా.

పుట్టా—మంచిది. పోయి వచ్చెదను.

(నమస్కరించి వెడలిపోవును.)

తెర పడును.

---

# ౫వ రంగము.

---

ప్రదేశము:—చిత్తూరుకోటగోడపై మహామ్మదీయులు, క్షత్రియులు పోరుచుందురు. మహామ్మదీయులు తీవ్రముగఁ బోరుటచే క్షత్రియులు పాఱిపోవుచుందురు. క్షత్రియసైన్యము వికావికలై పోవును.

[ప్రవేశము:—పుట్టా పట్టాకత్తితోఁ గనఁబడిన మహామ్మదీయులనెల్లర వధించును. మహామ్మదీయులు పుట్టాను జూచి భయకంపితులై పాఱిపోవుదురు.]

పుట్టా—ఓమహామ్మదీయయోధులారా ! పాఱిపోకుఁడు. పాఱిపోకుఁడు.

భండన మెన్నఁగాఁ బరుగువాఱుట గాదని, శత్రువర్గ మె
న్నండుశుభంబుగూర్పదను నాయ మెఱుంగకె, మీపురంబులం
దుండి మహాశ్రమంబులకు నోరిచి పాపము! వచ్చినట్టి మీ
కొండు సుఖంబు లే దరిబలోద్ధతిఁ జచ్చుటెగాని పోరిలోన్.

మహామ్మదీయమహాయోధులారా ! ఇంతటివేనా మీ పౌరుషములు ? (వికటముగా నవ్వి) ఎటులైనను మీకుఁ జావు తప్పినది కాదు— నాఖడ్గప్రఘాతమునుండి తప్పించుకొనిపోయినను మాకందకములోఁ బడుటచేత

నైనను మీకీఁ జావు తప్పినదికాదు—పోఁడు.
పోండు. (క్రిందఁబడియున్న ధర్మాజీని జూచి) హా!
పితాజీ! పితాజీ!! ఈచిత్తూరురణమునకు మీ మరణ
మునే నాందీపూజ గావించితిరా?

వైరులఁ దోలఁబోయి యరివర్గముచే వధియింపఁబడ్డన
ద్వీరుఁడు కన్నతండ్రి మిముఁదిక్కుగఁ జూపి దివంబు చేర, నన్
జేరిచి యుద్ధధర్మము లనేకము చెప్పితి రట్టి మీకు మ
మ్మారణమందు నొంటివిడిచియేగఁగ నెట్లుమనస్కరించెనో!

పితాజీ! నీ కీయశ్రుజలతర్పణముల నిడుట తప్ప వేఱే
మియుఁ జేయలేనందులకు నన్ను మన్నింపుఁడు.

[ప్రవేశ మొకరాజపుత్రయోధుఁడు.]

రా. యో—ప్రభూ! ప్రభూ! ప్రమాదము. ప్రమాదము.
మొగలాయీలు మీధాటకు దాళలేక యగ్నిబాణ
ములఁ బఱపుచున్నారు. వానినిజూచి రాజపుత్రులు
పరువులిడి పోవుచున్నారు.

పుట్టా—(చూచి) ఔనౌను—ఓరాజపుత్రయోధులారా! ఇంత
లోనేనా మీపరాక్రమములు! పాఱిపోకుఁడు.

భారతభూమి పేరు చెఱుపన్ దమకించెద రేల? హైందవుల్
గారొకో మీరు; శూరతతిగాంచినదేశము గాదె మీది; మీ
మీరణసాధనంబులఁ దమిమిన్ రిపువర్గము దేభదావకం
తీరవులై యశంబునను గసింపక పాఱుట ధర్మమౌనొకో?.

శాత్రవుఁ జీల్చి చెండాడఁ జాలరేని
స్త్రీల నగ్నిఁ బ్రవేశింపఁ జేసి రఁడు
మొఱకుతురకలఁ జేరి చేమోడ్పు లొసఁగి
సంచరింతము వారిపంచలనె మనము.

[ ప్రవేశము: పలువురు రాజపుత్ర యోధులు. ]

రా. యో—ప్రభూ! క్షమింపుఁడు. మహమ్మదీయుల ధాటికిఁ దాళఁజాలక పలాయన మొనర్చితిమి. ఇఁక మీపాదములయాన- జయమో మరణమో సంభవింపవలెఁగాక- వెనుకకు మఱలము. క్షమింపుఁడు. మాయపరాధముల సైరింపుఁడు.

పుట్టా—యోధులారా!
ఒడలు దాచిరి యరికంటఁ బడక; సరియె-
జమునిదృష్టిని బడకుండ సంచరింపఁ
గలరె యెల్లి; మృత్యు వెచట నిలిచిన, వెను
వెంట వచ్చి గ్రసింపదే? విడచునె మిము.

[ ప్రవేశము: వేఱొక యోధుఁడు. ]

యోధు—ప్రభూ! ప్రభూ!! గోరాసింగు రణనిహతుఁడైనాఁడు. వారియశ్వదళ మంతయుఁ పటాపంచలైనది. ఆద్వారముకడ నందుచే సమరము తీవ్రముగ నున్నది. దావూద్‌ఖాన్ లోనికిఁ బ్రవేశింప సిద్ధముగా నున్నాఁడు. ఆద్వారసంరక్షణము కడుంగడు ముఖ్యము.

పుట్టా—ఔనౌను. ఓ యోధుఁడా!

రాణా—ఎందులకు?

పుట్టా—మీరీద్వారముకడనే యుండి జాగరూకతతోఁ బోరు చుండుఁడు. నేను పోయి వచ్చెదను.

రాణా—చిత్తము.

(పుట్టా నిష్క్రమించును.)

[రెండవప్రక్కనుండి దావూద్ ఖాన్ కొంత మహమ్మదీయ సైన్యముతో]

దావూద్—సైనికులారా! బిజిలీపతి, జలాసింగు కూడఁ జని పోయిరి. రండు కోటలోఁ బ్రవేశింతము. మన మిచ్చట మొగలాయీపతాకమును నాటవలెను. లెండు. ఈ పని పూర్తి చేసినపిదప లోని కేగుదము.

మహ. సై—హాజరత్! ఇదే బావుటా!

దావూద్—(పాతుట నభినయించును.)

రాణా—(ఖడ్గము ఝుళిపించుచు) అరే! అరే!! ఏమి చేయు చున్నావు? జాగ్రత్త! కాచుకొనుము.

మారణభూమి శాత్రవసమాపకభూమియటంచెఱుంగ కే
పారగ నగ్నిఁ జొచ్చు శలభాకృతి వచ్చిన మిమ్ములన్ మహా
క్రూరనిశాతఖడ్గరుచిఁ ద్రుంచెద, నిప్పెద గౌరవంబు మా
భారతదేశమాతకు శుభంబొనఁగూర్చెద మోదనుందఁగాన్.

దావూద్—ఏవక్ నాగూ ! ఓహో !! యోఘుఁడా ! రమ్ము !
రమ్ము ! ! యుద్ధాన్కి తయ్యార్ ! !

(రాణాబాయియును దావూదును పోరుదురు. రాణాబాయి శిరస్త్రాణ మూడి క్రిందఁ బడును.)

దావూద్—అరే ! అరే !! హిది హెక్కడియోఘుడు జే— హోడ్గీ—హోడ్డీ—దీన్ని పటోక్కండి.

రాణా—తుచ్ఛుఁడా ! నీవే రమ్ము పట్టుకొనుటకు. (ఆకస్మికముగాఁ బైకి లంఘించి దావూదును పొడిచి చంపును. దావూద్ మరణించును.)

వేఱుసై—రా ! రా ! నిన్ను పట్టి ఢిల్లీకి తీస్కాపోతాన్ ! !

రాణా—ఏడిచినట్లేయున్నది నీపరాక్రమము. రమ్ము ! రమ్ము.

(వానినిగూడ సంహరించును)

మ. సైనికుఁడు—(వేఱొకసైనికునితో) అరే ! అరే !! ప్రమాదం—ప్రమాదం—ఈహోడ్డానిచేతుల్లో హంతా మర్గయా అయిపోతున్నార్. హరే ! హరే !! ఎందర్నిసర్కతోందిరా యిది. కాళికాలాగా వుంది. ఆతళ్వార్ తళతళ చూడు. ఖళ్ళ్యూ జిగ్ జిగ్ కి మూసుక్కపోతున్నాయి. నీవు మెనక్కలే మెళ్లి కొట్టేయి దాన్ని.

రెండవసైని—హోడ్డానితో యుద్ధమ్ సేయఁగూడదూ అని హాల్లావారి యాజ్ఞ. నీవే పోరి నీవే చావు—నేను అక్బర్ పాచ్ఛావారితో యీయోఘుఁడు సంగతి చెప్పి వస్తాన్.

మొదటివాఁడు—హారే ! నేనుమాత్రం హల్లా వద్దన్నపనీ చేస్తాన్ జే. నేను పోయి అక్బర్ పాచ్చాతో చెప్పి తెల్సుకొని వస్తాన్. అల్లాంహో అక్బర్ అన్నమాట మరచీపోయావా ?

రెండవవాఁడు—నేనుగూడ వస్తాన్.

(ఇరువురు నిష్క్రమింతురు.)

రాణా—ఓ రాజపుత్రయోధులారా ! కొందఱిటు వచ్చి యీ ద్వారముం గాచుచుండుఁడు.

[ ప్రవేశము: కొందఱు రాజపుత్రయోధులు ]

యోధు—చిత్తము. చిత్తము.

రాణా—(ముందునకు దృష్టి సారించి) అదిగో మొగలాయీపతి వచ్చుచున్నాఁడు. జాగ్రత్త !

[ ప్రవేశము: అక్బర్.]

అక్బ—(రాణాబాయిని జూచి) ఓహో ! రాజపుత్రయోధులు కాఁబోలు ! ఈరణభూమి కేతెంచినారు. మీ కీయోధుని వేషము బాగులేదు. అంతఃపురములోఁ గూర్చుండ వలసినవారికి యోధులతోఁ బోరాట మేల ? రండు మాయంతఃపురమున నుండవచ్చును. అబలలకు యుద్ధ మేల ?

రాణా—ఓరీ ! యేమి ప్రేలుచుంటివి ? ఇది సంభాషణమునకు సమయము కాదు. నీఖడ్గముం దీసికొని రణమునకు రమ్ము. అబలయో, నిన్ను వధింప సబలయో నీ విప్పుడే యెఱుంగవచ్చును. రమ్ము.

అక్బ—నీతో యుద్ధమునకు రాలేదు. నిన్ను జనానాకుఁ దీసికొనిపోవుటకు వచ్చితిని.

రాణా—ఛీ ! ఛీ ! పిఱికిపందా ! రణ మనిన భయపడియేనా యుద్ధమునకు రాలేదని సిగ్గు లేక చెప్పుచున్నావు. లే లెమ్ము. నీవు యుద్ధ మొనరించినను యొనరింపకున్నను నీకుఁ జావు తప్పదు. (ఖడ్గముతో నక్బరుపొట్టపైఁ బొడువఁబోవును.)

అక్బ—అరే ! అరే !! (ఖడ్గముం దీసి కలియఁబడును.)

(ఇరువురును బోరుదురు. అక్బరుకత్తి రాణాబాయి ముక్కలక్రింద విఱుగఁగొట్టును. అక్బర్ భయముతో నిలువఁబడును.)

రాణా—ఓయీ ! నీ విట్లు భయపడనక్కఱలేదు. మీవారి ఖడ్గముం దీసికొని రమ్ము. (అక్బ రట్లు చేయును. ఇరువురును బోరుదురు. అక్బరు చేతికి గాయము తగులును.)

అక్బ—(ఖడ్గము విడిచి) సైనికులారా ! మీరెల్ల రీమెం బట్టుకొని మావిడిదికిం దెండు. నేఁ బోయి వచ్చెదను.

సైని—చిత్తము. చిత్తము.

(అక్బరు పోవుచుండఁగా నతనివక్షస్థలమునకు గుఱి
పెట్టినఖడ్గముతోఁ బుట్టా యతనిని లోనికిఁ
ద్రోసికొనుచు వచ్చును.)

పుట్టా—

పాఱెదవేల మ్లేచ్ఛపతి! రణభండనభూమికిఁ జేరి శత్రులన్
జీఱఁగ లేక వెన్నిడి సజీవుఁడవై మఱలంగ నౌనె? చి
త్తూరు దివంబుఁ జేసికొనఁ దోడుమువారిని దెచ్చుకొంచు మీ
రీరణభూమి బాసి చన నెట్లొనగూడు సుఖంబు మీకికన్.

అక్బ—(భయమందుచు నూరకుండును.)

పుట్టా—

భారతదేశపాలనశుభాప్తికిఁ జేరినచక్రవర్తివై
పోరొనరింపకే తిరిగిపోయినచో నిను సాటివారలౌ
రా! రిపులన్భయంబున గృహంబునకున్జను దొంగ తంచు; నూ
వారలు నిన్నుఁ బోవిడిచివచ్చిన నన్నును దిట్టకుందురే?

కావున మనయిరువురకునుగూడ మరణమే మంచిది.
ఖడ్గపాణివై సమరమునకు రమ్ము.

చేరి నిను న్వధించియు వసించెద నీపురిఁ బట్టి; కానిచోఁ
బోరున నన్జయించిపురిఁ బొందియశంబు గడించి కొమ్ము; రా
చే రసపుత్రవీరరణసింహము లీల్గునొ, కాక యున్న మా
చేరిపుహస్తియూథము గ్రసింపఁబడంగలదో యెఱుంగనౌ.

(అక్బరు ఖడ్గముం గొనివచ్చును. పుట్టాయి నక్బరును బోరు చుండఁగా మ్లేచ్ఛసైనికులు రాణాబాయితోఁ బోరి యామెను గొట్టి పట్టుకొని పోవఁ జూతురు.)

రాణా—(ఆక్రందనమున)

హా! హా! పుట్టాసింహా! రక్షింపుము!!

పుట్టా—ఇదే వచ్చుచుంటిని. (అక్బరును వీడి మ్లేచ్ఛులబారి నుండి రాణాబాయిని రక్షించుచుండఁగా నక్బరు పలాయనము చేయును.) ఓ యోధుఁడా! నీ కిఁక భయము లేదు. రమ్ము. (ముందునకుఁ దెచ్చి కూర్చుండఁబెట్టి ఇటు నటుఁ జూచి) ఓహో! అక్బరుచక్రవర్తిగారు పలాయన మొనరించిరా? సరియే—యోధాగ్రేసరా! నిన్ను వారు పట్టుకొని గొనిపోవుచున్నా రేమి?

రాణా—అక్బరు వచ్చి నన్నుఁ బట్టుకొని తనయంతఃపురమునకుఁ గొనిపోవ—(స్మృతి నభినయించుచు సిగ్గుపడును.)

పుట్టా—(ఆలోచన నభినయించి తనలో) ఈతని నంతఃపురమునకుఁ గొనిపోవు టేమి? (రాణాబాయి మోము దిలకించి) యోధుఁడా! ని న్నంతఃపురమునకుఁ గొనిపోవ నేల?

రాణా—రాజపుత్రా! నే నేమని చెప్పఁగలను? నన్నుం గూర్చి యాతఁడు మఱియొకలాగున భ్రమించెనేమో?

పుట్టా—అయియుండవచ్చును. స్త్రీలను బోలినపురుషులును పురుషులం బోలినస్త్రీలును సహజముగ నుందురు గదా! లెమ్ము. నీవు నావెంటనే యుండెదవుగాక.

రాణా— నా కింక లేచుటకుం బ్రాప్తి లేదు. నీయాజ్ఞల ననుస రింపక యిట్లు వచ్చినందులకుం బ్రాయశ్చిత్తి మొందితిని.

పుట్టా—యోఘనుండా! క్షతగాత్రుండ వైన నీ విట నుండ నేల? రమ్ము—ఔషధాలయమునకు. వైద్యులు నీగాయముల బాగొనర్చెదరు.

రాణా—నా కేయౌషధాలయము వలదు. వలసినవైద్యుండు నా చెంతనే యున్నాండు. పావుగడియలో మృతిచెంద నున్న నా కావైద్య్య లేల?

పుట్టా—అయ్యో! పాపము!! నేనే నీగాయమునకుం గట్టు కట్టుదునా?

రాణా—నా కేమియు వలదు. నేను నిన్నుం జూచుచు మర ణించినం జాలును. ఇం కేమియు వలదు.

పుట్టా—(తనలో) నాహృదయము చేయివెట్టి కలంచినట్లైనది. హా! యేకలింగేశ్వరా! రాజపుత్రుల కెట్టియిక్కట్లను దెచ్చిపెట్టుచుంటివి? స్వదేశసంరక్షణార్థము కంకణము లం గట్టుకొనిన మే మెల్లరము నీకు దాయాదులమై పోతిమా! పోనిమ్ము. నీకృపలేని రాజపుత్రులు బ్రది కిన నేమి? పోయిన నేమి

[ ప్రవేశ మొక యోధుఁడు పర్వ్యాన. ]

యోధు — ప్రభూ ! జయమల్లుప్రభువు అక్బరుతుపాకిదెబ్బచే నేల కొఱిఁగినాఁడు.

పుట్టా — హా ! జయమల్లూ ! నీవును దివి కేగితివా ? కృతఘ్నుఁడ నైన నన్ను విడనాడవలెననియే యెంచి పోయితి వనుకొందు. నీతో మా చిత్తూరురాజ్యలక్ష్మికూడఁ దరలిపోయినదా ? హా ! చిత్తూరురాజ్యలక్ష్మి ! మీవారు దేశమాతా !

అన్నములోనమన్నిడిగృహంబునకుకె వెసఁ జిచ్చువెట్టి యాపన్నులఁ జేసిపోయి యరివర్గములోఁ దల దూర్పనుంటి పీవన్నవిధంబు మే మెఱుఁగకమైతిమి ! నేఁటికి మోసగించితే నిన్ను భజించునీసుతులకనే బలిగొంటివె పుత్రఘాతకీ !

ఓయీ ! యోధుఁడా ! నీవు పోయి శస్త్రాగారమును సంరక్షించుచున్న వీరాసింగుగారి నిటకుఁ దోడ్కొని రమ్ము. పొమ్ము.

(యోధుఁడు నిష్క్రమించును.)

రాణా — వారి నెందులకు రావించెదరు ? శస్త్రాగారమును సంరక్షింప వలదా ?

పుట్టా — ఇంకను శస్త్రాగారసంరక్షణ మేల ? చిత్తూరుస్త్రీలకు చితులు పేర్పించుటకంటెను శస్త్రాగారసంరక్షణ మెక్కుడుముఖ్యము కాదు.

రాణా—రాజపుత్రాంగనలకు నేఁటికిఁ జిత్తూరులోఁ దలదాఁచుకొనుటకుఁ జితులే కాని యంతఃపురములు పనికి రావా? హా! యేకలింగేశ్వరస్వామీ! నీ కెంత నిర్దయ కలిగె. ఆర్యా! మీ రావీరాసింగును బాగుగ నెఱుంగుదురా?

పుట్టా—ఆఁ— ఎఱుఁగ కేమి? వారు మామామగారే!

రాణా—అనిన—

పుట్టా—పిల్ల నిచ్చిన మామగారే.

రాణా—ఏమి రాణాబాయినా?

పుట్టా—అట్లడుగుచుంటి వేమి?

రాణా—ఏమియును లేదు. మొన్నటివఱకును నేనును రాణాబాయియు నొకేప్రాణముతో నుంటిమి.

పుట్టా—అట్లనా? ఆమె క్షేమముగ నున్నట్లే కదా?

రాణా—క్షేమమున కెక్కడికి—రాజపుత్రాంగనలకుఁ దలదాఁచుకొనఁ జితులే కాని యంతఃపురములు పనికిరావు గదా?

పుట్టా—ఏమి—యోధుఁడా! అట్లనుచుంటి వేమి?

రాణా—ఏమియును లేదు. ఆయాస మెక్కుడుగ నున్నది.

పుట్టా—నన్నానుకొని కూర్చుండి యుండుము.

(పుట్టా కూర్చుండును.)

రాణా—(ఆనుకొని వణఁకుచు) వలదు. వలదు. న న్నంట కుఁడు.

పుట్టా—ఏమది ? భయము లేదు. కూర్చుండుము.

రాణా—వలదు. వలదు. మీరు పోయి పోరా నర్హుఁడు. చావ నున్న నాకు సాహాయ్య మేల ?

[ప్రవేశము: వీరాసింగు.]

వీరా—(రాణాబాయిం జూచి) రాణాబాయి ! ఇస్థితి వేమి ?

రాణా—రణనిహతురాలనై నాప్రాణనాథునిచెంత నస్తమయ సమయమున నుంటిని.

పుట్టా—(విషాదాశ్చర్యములతో) ఏమి-ఏమి—యీ మె—రాణా బాయియా ? హా ! హా !! రాణాబాయీ ! నీవాక్య ముల నెఱుంగలేకపోయితిని. ఆహా ! నీవును నిజదేశ సేవారాధనఫల మనుభవించుచుంటివా ? అయ్యో ! మామగారూ ! మావివాహఫలిత మిట్లు ఫలించినదా?

వీరా—పుట్టాజీ ! ఇందు విచారింప ననసరము లేదు. అరివర్గ మునకే జయము చేకూరినచిహ్నములు పొడచూపు చున్నవి. కావున, మనమెల్లరము కొలఁదికాలములో వీరశయన మలంకరింపవలెఁ గదా ! అందుచే ముందు గఁ బోవువారికై వెనుకఁబోవువారు విచారింప నక్క ఱ లేదు.

పుట్టా—నిజమే. అందులకయినేను మిమ్ముల వర్తమానించితిని. చిత్తూరుస్త్రీలకుఁ జితులఁ జేర్చి వారల జోహారొనర్చునట్లు చేయుఁడు.

వీరా— పుట్టాజీ ! నా కిదేటియాజ్ఞ ? నా చే నీఘనకార్యము చేయించుటకా శస్త్రాగారసంరక్షణనెపమున నన్ను బ్రదుకునట్లు చేసితిరి ? మన కెందుల కీయపజయము సంప్రాప్తించినది ?

పుట్టా—మామగారూ ! మనజయము మానసింగును బట్టుకొనుటలో నుండు నని తప్పుగఁ దలఁచి వాని బట్టించుటకై గోరాసింగును నాల్గువందలయశ్వదళమును నియమించి పంపించితిని. కాని వారికందఱకు మానసింగుచేతిలో మరణము సంభవించినది. అతఁడు కాతఁడు విశేష శ్రమ లేకుండ జయమల్లుచేఁ బట్టుకొనఁబడినాడు. ఆతని మనలోఁ జేరి యక్బరుతోఁ బోరవలసిన దని మాతల్లిగారిచేతఁ బలువిధములఁ జెప్పించితిని. అంతయు నిష్ప్రయోజన మైనది. నే ననుకొనిన పతకము కుదిరినదికాదు. అందుచే మన కపజయము సంప్రాప్తించినది. ఇంతకును మీకు ధైర్యమున్నంత కాలము నేను చితులవిషయము తలఁచుకొన లేదు. కాని యిప్పటి కని వార్యకార్యమువోలె నయ్యెదికన్పట్టినది. కావున నీకార్యమొనరింప మి మ్మర్థించి యున్నాను.

వీరా—పుట్టాజీ! నేఁడాదిత్యవారము. చిత్తూరులో నేఁడు చితు లంటించితిమా, రసపుత్రవీర్యము నేటితో సంతరించునే! ఇట్టియెడఁ జితు లంటించుట తప్పనిపని యగు నెడల నట్లే చూచుకొందము.

పుట్టా—కానిమ్ము. కానున్నది కాకమానదు. రణములో నేఁడు మరణించినయంగనలే వేయిమంది కలరు. అయిన నింక నంతఃపురస్త్రీలసంఖ్య యెంత? తొమ్మండుగురు రాణులే గదా! కానిమ్ము. వారైనఁ జూలెంతలు బాలెంతలు గావునఁ బోనొప్పలేరు.

వీరా—నిజమే. కాని నన్నిట్టిపనికై నియమించుట న్యాయమగునే?

పుట్టా—ఇట్టికార్యములకు ధీరు లగుపురుషులనే నియమింపవలెఁ గదా! కావున ధీరులైన మిమ్ముందుల కేర్పాటు గావించితిని. నాప్రార్థన మాలించి పోయిరండు. మనసైన్యములు సర్వమును రూపుమాసినవి. మన మిప్పు డశ్రద్ధచేసినచో గౌరవాభిమానధనులైన రాజపుత్రాంగనలకు ద్రోహము చేసినవార మగుదుము. కావున మీరు సత్వరంబుగఁ బోయి యాకృత్య మొనర్పుఁడు.

వీరా—హా! హా!! ఎంతదుస్థితి పట్టినది! (ముందునకు వచ్చి)

అవనికిఁ జేరు దెచ్చెడికులాంగన లందఱు రాజపుత్ర గౌ
రవ మను పేరు చెప్పి చితులం బడఁద్రోయఁగఁ జేత కాదు; దే
శవిభవమే కనుంగొనెదు క్షత్రియపుత్రులఁ గాంచుతల్లులన్
బవరమునా గెసంబు గొని పావకుఁ జేర్పఁగఁ జేతులాడునే ?
కనికర మింత లేక కులఘాతుక కార్యము చేయఁ బంప నే
ననలమునందు ద్రోయఁగఁ గులాంగనలన్ మనసొప్పదింక నే
జనవము నొంది యిట్టిపరుషంబగు కృత్యము జేయుకంటెనా
సునిశితఖడ్గముంగొనుచు స్రుక్కెదనిప్డె యాత్మహత్య చేన్.

[తెరలో]—అల్లాహో అక్బర్ !

ఓహో! శాత్రవసైన్యములు కోటలోనికిఁ జొఱుచున్నవి
శత్రువు లంతఃపురములఁ బ్రవేశించిరేని మహమ్మరులై
కానిపను లొనర్చెదరేమో ! కాన నేఁ బోయి చితు
లంటించి వచ్చెదఁగాక. కాలమువచ్చినప్డు దేవనిర్మైనఁ
జేయుక తప్పదు. పోయి నా కార్య మొనరించి పిమ్మట
వెంటనే ఖడ్గపాణినై యవనులఁ దునుమాడుటయో,
ఆత్మహత్యయో చేసికొనవచ్చును.

(నిష్క్రమించును.)

పుట్ట—రాణాబాయీ ! శాత్రవులు కోటలోనికిఁ బ్రవేశింప
నున్నారు. చిత్తూరురాజ్యలక్ష్మి పరాధీన మైపోవుచు
న్నది. రాజపుత్రీస్థానమునందలి మానవంతులను బ్రదు

కుం దెరువు లేదు. భారతదేశమునకా శాశ్వతబానిసత్వము స్థిరపడుచున్నది. మానాభిమానశూన్యులైన రాజపుత్ర యోధులకు స్వర్గమే శరణ్యమగుచున్నది. నన్నుం బెండ్లియాడుటచే నీకును ఆగతియే పట్టనున్నది. హా! నీ యీదారుణవధమునకుం గారకుండను నేనే గదా! రాణాబాయీ! నీహృదయపూర్వకముగా నన్ను మన్నింపవా నాయకృత్యమునకు. వివాహమునాండే యుద్ధము సంప్రాప్తమగుననియు, వివాహదినమునైనం బూర్తి గాకుండ మన మిట్టిబలవన్మరణములపాలు కావలసివచ్చుననియుం దలంపక, నిన్ను వివాహము చేసికొని యిట్టిదారుణకష్టముల నీకు సమకూర్చిన యీపుట్రాను నీహృదయపూర్వకముగ మన్నింపవా? ఈయుద్ధమును గూర్చిన యాథార్థమైన వార్తలు వివాహమునకు ముందే స్వల్పముగనైనం దెలిసియున్న నీ కిట్టికష్టములు కలుగంజేసియుండను. నేను బ్రహ్మచారినై పోరియుందును.

రాణా—ఆర్యా! ఇవి యేటిమాటలు? మిమ్ముల వివాహము చేసికొనుటచే నీకష్టములు రాలేదు. మనభారతదేశము పరరాజపాలనమునకు లోనైననాండే మనలకందఱకును మహాపద సంభవమైనదని తలంపవలెను. ఆమహాపద భారతీయులబానిసత్వముతోంగాని నశింపదు. కావున

నాకష్టములకు మీరు కారణభూతులు గారు. అందులకై మిమ్ముల మన్నించుట కేమున్నది. మీరు నాగతికై విచారించుటకంటెఁ బోయి పోరొనర్పుఁడు. మీయట్టివారికరమును బట్టుటచే క్షత్రియకాంత కర్హమైనమృత్యువు రానున్నదని సంతోషించుచున్న నాకై మీరు ప్రాజ్ఞులయ్యు విచారించుట భావ్యము కాదు. నా కిట్టిసావకాశమును గలుగఁజేసినందులకు మీతల్లిగారిని మిమ్ములనుగూడ వేనోళ్ల స్మరించుకొనుచు బ్రహ్మానందముతో వీరస్వర్గ మలంకరింపనున్న నాకై మీరు విచారించుట కర్తవ్యము కాదు. పోయి శత్రువుల నిర్జింపుఁడు. ఈస్వల్పావకాశమును దీసికొని వారు మఱింత పెచ్చు పెరుఁగుదురు. నాకై విచారింపకుఁడు. స్వరాజ్యసంపాదనార్థమై జరుగు పోరాటములలో నాయట్టివారు వేనకువేలు మరణింపవలసి వచ్చుచుండును. అట్టియెడ నొక్కవనితకై మీరు విచారింపవచ్చునా? విచారింపరాదు—అదిగో! కోటలోఁ జితులంటుకొనిన మంటలు అభిమానవతులైన రాజపుత్రాంగనలకు స్వర్గపథములఁ జూపుచున్నవి. నాకును ఆయాసము మిక్కుటముగ నున్నది. నాకై విచారింపక నన్ను మఱచి దేశసేవ చేయుఁడు. నా—రా—య—ణా.

(పుట్టాకు నమస్కరించి చనిపోవును.)

పుట్టా—హా! రాణాబాయీ! రాణాబాయి! తరలిపోతివా! నా ప్రేమతో— నాశక్తితో— నాయుత్సాహముతోఁ గూడఁ దరలిపోతివా! ఖేల్వాసంస్థానాధీశ్వరీ! చిత్తూరు రాజ్యలక్ష్మితో—మేవారు దేశ స్వాతంత్ర్యలక్ష్మితోఁ గూడఁ దరలిపోతివా?—హా! హా!! యిట్టి దేశస్వాతంత్ర్యాభిలాషిణి కీరాజపుత్రస్థానములోఁ గలదాఁచుకొనఁ దావు లేకపోయినదా! హా! నీవివాహములోఁ గట్టిన యీబాసికమైన విప్పకయే నీవు చేసిన పెండ్లిబాసల మఱచి వెడలిపోతివా! ఇఁక నాబ్రదు కెందులకు? నిన్ను వెంటనంటెద—కాని—ఒకసారి బ్రదికియుండఁగనే తనివిదీఱఁ దీర్చుకొనలేని నాకోరికకు—ఒక్కసారి—నన్నుఁ గైకొననిమ్మా. (ముద్దిడి లేచి) హా! హా!! రాణాబాయి! రాణాబాయి!! (ఖడ్గమును దీసికొనఁ బోవుచుండఁగా వెనుకనుండి దొంగపోటున మహామ్మదీయు లాతనిపైఁ బడి పొడుతురు. తెరలో మందుకొట్టము లంటుకొనిన యగాదులు—కోట పతనమగును.)

తెర పడును.

తృతీయాంకము.

సర్వము సమాప్తము.

---

# త్రిలింగ

వారపత్రిక. ఇందు ఆర్థిక, రాజకీయ, మత, నైతిక, సాంఘిక, పారిశ్రామికాది విషయములే కాక విమర్శనములు వ్యాఖ్యలుకూడ ప్రకటింపబడుచున్నవి.

తిరువత్తూర్, మద్రాసు. సంవత్సరముచందా రు 2-8-0

---

# జ్వాల.

ఉత్సాహమైన పత్రిక. తన ఆశయాల్ని చెప్పడంలో యేమాత్రం జంకు లేదు. సంఘసంబంధమైన విషయాల్నే యెక్కువగా ప్రచురిస్తుంది. సం॥రం చందా 1-0-0 పైగా.

విడిప్రతి 0-1-0 బెజవాడ.

---

# సరస్వతి.

ప్రతిఆదివారం ప్రకటితం. ఎక్కువగ చిన్నచిన్న కథల్ని ప్రకటిస్తుంది. అవి సవ్యపుష్టాలు.

విడిప్రతి 0-0-6 సం॥రం చందా 2-0-0

విశాఖపట్నం.

---

# జమీన్ రైతు.

నెల్లూరుజిల్లా జమీన్ రైతు సంఘయాజమాన్యమున ప్రతిశుక్రవారము ప్రకటింపబడును. జమీందారులన్న జడుపు ప్రభుత్వమువారన్న భయము నిజం చెప్పటంలో నీప్రతిక నిర్మోహమాటపు నిష్ఠ. కార్మికుల కిది పట్టుకొమ్మ. ఆంధ్రరాష్ట్రము నందలి రైతులందరి అభివృద్ధికొరకు కృషి చేయుటకు కంకణము కట్టుకొన్నది. సంవత్సరం చందా **రు. 4-0-0.** నెల్లూరు.